C RMRo1A151

శ్రీః

# హరిమీడే స్తవః

శ్రీ మచ్ఛంకరాచార్యకృతమ్

మచర్చికా వ్యాఖ్యానమ్
(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

దోర్బల విశ్వనాథ శర్మ

ప్రకాశకులు
విశ్వేశ్వరాశ్రమము
సంస్థాపకులు
శ్రీ శ్రీ శ్రీ చిదానంద భారతీస్వామి,
రామాయం పేట

A RMR01A151

శ్రీః

# హరి మీడే స్తోత్రమ్

శ్రీ మచ్ఛంకరాచార్యకృతమ్

మచర్చికా వ్యాఖ్యానమ్
(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

దోర్బల విశ్వనాథ శర్మ

ప్రకాశకులు
విశ్వేశ్వరాశ్రమము
సంస్థాపకులు
శ్రీశ్రీశ్రీ చిదానంద భారతీస్వామి,
రామాయంపేట

©
1. R. MOHANA RAO, M.Sc.,
H.No.: 4-103, I.L.T.D. Colony (Extn.)
Kothapet, CHIRALA - 523 157
✆ : 08594 - 34054
2. DORBALA VISWANADHA SHARMA

First Edition : 29th December 1998
బహుధాన్య సంవత్సరము - పుష్యమాసము - ముక్కోటి

Price : Rs. 20/-

All Rights Reserved
No part of this commentary of HARI MEEDĒ STAVAHA may be reproduced, stored in a retrieval system or trasmitted in any form or by any means, or translated, without the prior permission in writing of R. Mohana Rao, nor be otherwise circulated in any form of binding or cover other than that in which it is published and without a similar condition including this conditon being imposed on the subsequent purchaser. However, this book with commentary can only be published without any prior permission by any **'Vaishnava Kshetra'** of the world. It can be used in INTERNET also by these Vaishnav Kshetras only.

**హరి మీడే స్తవః - శ్రీ మచ్ఛంకరాచార్య కృతమ్**
మచర్చికా వ్యాఖ్యానమ్ -(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)
దోర్బల విశ్వనాథ శర్మ - ప్రథమ ముద్రణ - ముక్కోటి, 29-12-98
పేజీలు: 96 ప్రతులు : 1000
ప్రతులకు : 1. విశ్వేశ్వరాశ్రమము, రామాయం పేట, మెదక్ జిల్లా 502 101
2. సాధన గ్రంథ మండలి, తెనాలి - 522 201

D.T.P. by
*MR LASER PRINTS*
CHIRALA - 523 155
☎ : 08594-36074

PRINTED at
JYOTHI OFFSET PRINTERS,
Kotha Peta, CHIRALA.
Ph : 32561, 33773

శ్రీ రామానుజ యతిభ్యో నమః



ప్రియశ్రీమాన్ ఆర్. మోహనరావుగారు!
శ్రీమతే నారాయణాయ నమః
అనేక మంగళాశాసనములు!

మీరందించిన గ్రంథరాజము లందినవి. శ్రద్ధాళువు, జిజ్ఞాసువు అయిన వ్యక్తి తత్వాన్ని తెలుసుకొని నిరంతర మననము చేయడానికి సాధనగ ఏర్పాటు చేసిన ఆధ్యాత్మ వాఙ్మయమే స్తోత్రవాఙ్మయము. వివిధ దేవతాస్మరణ రూపముగ ఏర్పడ్డ ఈ స్తోత్రాలు ఆయా దేవతల పట్ల భక్తులలో అభినివేశాన్ని కలిగించి మానస సంతృప్తిని కల్గిస్తాయి.

ఎక్కడోవున్న గుణాన్ని తెచ్చి, ఆరోపించి తాను మెచ్చిన వస్తువును కీర్తించుటను స్తోత్రమని లోకవ్యవహారం.

"స్తోత్రం నామ యద్యన్యదీయాన్ గుణాన్ అన్యత్ర
అనతః ఆరోప్య ఫణితిః ఇత్యామనన్తి"

అయితే శ్రీహరి విషయములో అలా కాదంటాయి మన ఋషుల ఉపదేశాలు, ఉన్నదానిలో అందిన అత్యల్పాంశమును స్పృశించుటే శ్రీహరి స్తోత్రమంటారు ప్రాజ్ఞులు. అట్టి శ్రీ హరిని కీర్తించి జిహ్వను సార్థక పరచుట జనిచారితార్థ్యాన్ని సంతరించుకొనుట మహానుభావులు చేసిన పని.

ఆదిశంకరులు రచించినదిగ చెప్పబడే ఈ 'హరిమీడేస్తవ' మును దోర్బల వారు వ్యాఖ్యానించిన రీతి అతి సరళము, సరసము కూడ. దానిని మీరు ముద్రింపబూనుట అతిముదావహము.

ఇలాంటి ఉత్తమ గ్రంథాలను, అపురూప గ్రంథాలను మరిన్నింటిని పునర్ముద్రణలతో ఆయుఃపూరణము, వర్ధనము గావిస్తారని ఆశిస్తూ అనేక మంగళాశాసనములు చేస్తున్నాం.

త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ జీయర్ స్వామి

ఈ వ్యాఖ్యానగ్రంథము
"కలికి కావేరి తరగల బాహులతలనే తలగకిటు
రంగ మధ్యపు శ్రీరంగ శిశువు" శ్రీ భూ నీలా సమేత
శ్రీ రంగ నాయక స్వామివారి పాదపద్మములకు సమర్పితము.

# హరి మీడే స్తవః-పరిచయం

జ్ఞానవాసిష్ఠచతుర్థపాదషష్ఠాధ్యాయమున తం చిన్మాత్రం సాక్షిణ మేకం శివ మీడే అను మకుటముగల శివ స్తుతి "శివ మీడే స్తవ" ముగా ప్రసిద్ధి చెందియున్నది. బహుశః దానిని దృష్టిలో నుంచుకొని తం సంసారధ్వాన్త వినాశం హరి మీడే అను మకుటముతో శివ స్తుతి ప్రతిద్వంద్విగా రచింపబడిన హరి స్తుతి హరి మీడే స్తవముగా ప్రసిద్ధి చెందినది. శివ మీడే స్తవము నందువలె నీ హరిమీడేస్తవమందును, ఉపపన్మంత్రార్థమద్వైతపారమ్యముగా వివరింప బడినది. రెండును దాదాపు ఒకే వృత్తమున రచింపబడినవి. శ్లోక సంఖ్యయు దాదాపు సమానముగానే ఉన్నది. స్వల్పవ్యత్యాసములు అకించిత్కరములు.

హరిమీడేస్తవము శ్రీశంకరకృతమని చివరి శ్లోకమందలి భగవత్పాదీయమ్ అను పదమువలన తెలియుచున్నది. శ్రీ శంకరులను భగవత్పాదులని పేర్కొనుట ప్రసిద్ధము. ఈ స్తోత్రమునందలి 43 శ్లోకమున "ఆంగిరసమ్" అనుపదము ఏతత్స్తోత్ర రచయిత బృహస్పతి అనిగాని ఆంగిరసగోత్రజుడనిగాని చెప్పుచున్నది. శ్రీ శంకరులు బుద్ధిలో బృహస్పతి యనుట నిస్సందేహము.

ఈ శివ హరి స్తవములలోని శివ హరి శబ్దములు పరమాత్మ వాచకములు. ఉభయస్తోత్రములలోను వారి సగుణరూపములు స్తుతింపబడలేదు. సగుణ రూపములలో ఒకవేళ భేదమంగీకరింపబడినను, వారి నిర్గుణత్వము స్తుత్యముగా స్వీకరింపబడినది. తావన్మాత్రసగుణత అంగీకరింపబడినది. వాస్తమునకు మాయ యందలి సగుణత్వమే వారి యందారోపింపబడుట వేదశాస్త్ర ప్రసిద్ధము.

శివశబ్దము గుణాతీత్వమును సూచించును. హరిశబ్దము తొలగించు వాడు అను నర్థము నిచ్చును. రెండును ద్విలఘుశబ్దములు గావున ఈ వృత్తమున చక్కగా నిమిడిపోయినవి.

శివమీడేస్తవమున ప్రతి శ్లోకము చివరి పాదమున (మకుటము) సాక్షి పదమున్నది, హరిమీడేస్తవమున 14వ శ్లోకములోని మూడవ పాదారంభమున మాత్రమున్నది. శివమీడేస్తవము యొక్క చివరి పాదమున (మకుటము)

చిన్మాత్రమ్ అను పదము ప్రతి శ్లోకమునను ఆవృత్తమైనది. హరిమీడేస్తవము యందు తదర్థకమైన కేవలవిజ్ఞానమ్ అను పదము 37వ శ్లోకమున ప్రయోగింప బడినది.

సంసారము అంధకారము (హరిమీడేస్తవమందు ధ్వాన్తము) దానిని హరించువాడు హరి. ఈ హరిమీడేస్తవమందు ఒకటి రెండు సార్లు విష్ణువనియు పేర్కొనబడినాడు.

హరి శబ్దము సూర్యుడను అర్థమును కూడ నిచ్చును. సంసారధ్వాన్త నివారణము అనుకృత్యమాతనికనాయాససాధ్యమని వ్యంజింపజేయును. విష్ణువు నందు సూర్యత్వారోపమును హరి శబ్దము శ్లేషబలమున నిర్వహించుచున్నది. సంసారమునందు ధ్వాంతారోపము స్పష్టముగానే ఉన్నది. ఈ స్తోత్రము యొక్క చివరిశ్లోకము భవభీతిధ్వాన్తార్కాభమీభగవత్పాదీయ స్తోత్రమని ఫలమును పేర్కొనుచున్నది. సంసారభయమను చీకటిని నివారించుటలో సూర్యునితో తుల్యమైనదీ స్తోత్రమని ఔపమ్యమును చెప్పినది. స్తోత్రము శబ్దరూపము కావున ఔపమ్యమును స్తోత్రప్రతిపాద్యహరి అర్థరూపుడు కావున ఆరోపము (అభిన్నత ప్రతిపాదకము) సముచితములుగా నున్నవి. స్తోత్రము సంసారభయమును తొలగించును. తత్ప్రతిపాద్యహరి సంసారమునే హరించును. మనవంటి సంసారులకు భీతి తొలగిన చాలును గదా!

ఈ స్తోత్రమును తైత్తిరీయోపనిషత్తులోని భృగువునకు వరుణుడు చేసిన ఆత్మపంచకోశవిలక్షణత్వోపదేశము, ఛాందోగ్యోపనిషత్తులోని శ్వేతకేతువునకు ఉద్దాలకుడు చేసిన తత్త్వమసియను ఉపదేశము ప్రముఖముగా ప్రస్తావింపబడినవి. ఇంకను కేన మాండుక్యాద్యనేకోపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ఆత్మస్వరూప విచారణాంశములు ఈ స్తోత్రమున చక్కగా వివరింపబడినవి. పాఠకులు చదివి చక్కగా మననము చేసికొని కృతార్థులగుదురుగాక!

ప్రూఫుచూచుటలో సహకరించిన శ్రీ చింతగుంట సుబ్బారావుగారికి శ్రీమన్నారాయణుడు ఆయురారోగ్యైశ్వర్యములు ఇచ్చుగాక!

- దోర్బల విశ్వనాథ శర్మ

శ్రీః

# హరి మీడే స్తవః

(శ్రీ మచ్ఛంకరాచార్యకృతమ్)

మచర్చికా వ్యాఖ్యానమ్

(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

**దోర్బల విశ్వనాథ శర్మ**

అవతారిక:-కరుణాలయులైన శ్రీశంకరులు దురవగాహమైన ఉపనిషద్బ్రహ్మ సూత్రాది విద్వద్వేద్యగ్రన్థముల రచించి ఉపనిషద్బ్రహ్మసూత్రాది ప్రతిపాదితాద్వైత సిద్ధాంతమును సామాన్య సంస్కృతజ్ఞుల కర్థమగు రీతి హరి స్తుతి వ్యాజమున వివరించు చున్నారు.

శ్లో॥ స్తోష్యే భక్త్యా విష్ణు మనాదిం జగదాదిం
యస్మి న్నేత త్సంసృతి చక్రం భ్రమ తీత్థమ్।
యస్మి న్దృష్టే నశ్యతి త త్సంసృతి చక్రం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 1

ప్రతిపదార్థము:-యస్మిన్=ఎవని యందు, ఏతత్=ఈ, సంసృతి చక్రమ్= సంసార చక్రము, ఇత్థమ్=ఈ విధముగా, భ్రమతి= తిరుగుచున్నదో, అనాదిమ్=ఆదిలేని, జగదాదిమ్=జగమున కాది యైన, విష్ణుమ్=విష్ణువును, స్తోష్యే=నుత్తించ గలను, యస్మిన్=ఎవడు, దృష్టే= తెలియబడగా,తత్=ఆ, సంసృతి చక్రమ్= సంసారచక్రము,నశ్యతి= నశించునో, తమ్=ఆ, సంసార ధ్వాంత వినాశమ్= సంసారమను అంధకారమును నశింపజేయు, హరిమ్= హరిని, భక్త్యా=భక్తితో, ఈడే= స్తుతించెదను

తాత్పర్యము:- ఎవని యందీ సంసార చక్రమీ విధముగా భ్రమించు చున్నదో ఆదిలేని వాడై జగమునకాదియైన ఆ విష్ణువును స్తుతించ బూనెదను. ఎవని దర్శనమైనంతనే ఈ సంసారచక్రము నశించునో సంసారాంధ కార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

వివరణము:- చక్రమునం దాద్యంతములు స్థూలముగా చూచువారికి

గోచరించవు. చక్రము మనుష్య నిర్మితము కావున దాని ఆద్యంతములు తన్నిర్మాతకు మాత్రము తెలియును. ఈ సంసారము చక్రమువలె ఆద్యంతములు తెలియక పోయినను మనకు దృశ్యమై యున్నది. అది మనకు దుఃఖానుభవమును కలిగించు చున్నందున తెలియబడకుండు టెట్లు? సంసారమున కాద్యంతములు లేనట్లిందలి దుఃఖమునకు ఆద్యంతములు కానరాకున్నవి. ఇట్లుండగా ఆ విష్ణువు జగన్నిర్మాత యని ఈసంసారమున జీవులందఱను త్రిప్పుచున్నదాతడే యను వేదశాస్త్ర సద్గురుబోధ ననుసరించి ఆతని స్తుతియే సంసారభ్రమ నివారకమని యెఱింగి ఆ విష్ణువును స్తుతించుట ఆరంభింపబడుచున్నది. ఈ సంసారము చక్రము వంటిదే కాదు అంధకారము వంటిదై దాని నుండి బయటపడుటెట్లో తెలియనీయకుండగా సంసారాంధ కారము తొలగించు భాస్కర స్వరూపుడా హరి యని సద్గురువు వలన నెఱింగి ఆ హరిని స్తుతించెదను.జగమనగా గమించునది, చక్రమనగా క్రమించునది. సంసారమనగా సరించునది. గమించుట, క్రమించుట, సరించుట ఈ మూడును గతులే. పరమేశ్వరుని చేత నొక చక్రమున్నదనుకొందము. అదియే జగత్తు. దాని నాతడు త్రిప్పినాడు. చక్రము తిరుగుట నారంభించింది. కొంతసేపు తిరిగి ఆతని చేతిలోనే ఆగిపోయినది. జగత్తునకు జగత్వమును అనగా తిరుగులక్షణమును కల్పించినది విష్ణువు కావున ఆతడు జగదాదియని పేర్కొనబడినాడు. జీవుల అనాది కర్మవిశేషము చేతనే జగచ్చక్రము తిరుగుచునే యున్నది. పుట్టుట, కొంతకాలము మనుట, తిరిగి చచ్చుట అను మూడు క్రియలు నిరంతరము జరుగుచునే యున్నవి. క్రియ అనగా గతియే. దీని కాద్యంతములు లేవు. కావున జగము చక్రము వంటిది. భగవానునకు భిన్నముగా నీ జగమెచ్చట నుండి వచ్చినది? రాలేదు, భగవానుడే జగముగా కనబడు చున్నాడు. అభిన్నమైన వస్తువైన భగవానుడే భిన్న భిన్నముగా కనబడుచున్నాడు. జీవున కొకనికి జగద్దర్శనము కలుగుట ఆతనికి బాల్యమున ఆరంభమైన దనుకొందాము. ఆనాడే ఆతడు జగమును చూచిననాడే ఆ జగమున కారంభము కావున ప్రతిజీవునకు భిన్న భిన్న జగములు కనబడుచున్నవి. అట్లా దర్శనానుభవము కలిగిననాడే ఆతనికి జగదారంభము. అది నిజముగా లేకున్నను భగవంతునందు కనబడుట ఆరంభించబడినది కావున భగవానుడు జగదాది యని పేర్కొన బడినాడు. ఈ జగమంతయు అవ్యక్తోపాధికుడైన

భగవానుని యందు కొన్నికోట్ల సంవత్సరముల క్రింద జగముగా బహుస్యామ్ అను సంకల్పము ననుసరించి సృజింప బడినది. కావున భగవానుడు జగదాది యని పేర్కొనబడినాడు. ఈ జగము ఒకటి కాక అనేకములు, అనంతకోట్లు. ఇవి అన్నియు ప్రతిక్షణము పరమేశ్వరుని యందేదో ఒక జగము పుట్టుచున్నది కావున పరమేశ్వరుడు ప్రతిక్షణమునను జగదాదియై ఉన్నాడు. సంసారము చక్రమనబడినది. దానికి అవ్యక్తము మూలమేయై ఉన్నను జీవులు సంస రించుట మాత్రము అనగా భేద దుఃఖానుభవము మాత్రము లేనంత వరకు సంసారము పుట్టలేదు. అవ్యక్తము నుండి స్వప్నావస్థ కల్పితావస్థ అను మాయాగత విక్షేప శక్తి ప్రసరించుట కారంభించుటయే జగదారంభము. జగదారంభమనగా సృష్ట్యారంభమే. దీని యొక్క( ఈ విక్షేప శక్తి యొక్క) ఆది భగవానుడే కావున భగవానుడు జగదాది యనబడినాడు. సమష్టి జీవకర్మ పరిపక్వమై ఫలించుట కారంభించుటయే భగవానుని జగదారంభ సంకల్ప హేతువు కావున అదే ఆ సంకల్పమే జగదాది. అది పరమేశ్వరునందే కలిగినది కావున ఆతడు జగదాది యని పేర్కొనబడినాడు. పరమేశ్వరుడే జగముగా సంసారముగా భ్రాంతితో అజ్ఞులకు కనబడుచున్నాడు. ఆ పరమేశ్వరుని పరమార్థాత్మ సాక్షాత్కారము కలుగగా సంసారాంధకారము నశించును. భగవదనుగ్రహమున కలుగవలసిన జీవుల ఇట్టి సాక్షాత్కారము భగవద్భక్తి లేనిదే కలుగదు కావున జీవుల సంసార అంధకార నాశన ప్రయోజనము వర్తించి తన నాదర్శముగా తీసికొనుటకు తన యందు భక్తిని కల్పించుకొని ప్రకాశకులీ స్తోత్రము నారంభించి హరి మీడే అనుచున్నారు. విష్ణువు యొక్క యొక చేత చక్రమున్నది. అది సుదర్శన నామకము అనుట పురాణప్రసిద్ధి. అది మనస్తత్త్వ రూపమని విష్ణుపురాణము చెప్పినది. చక్రమువలె మనసును తిరుగు చుండును. అట్టి మనసు శమదమాది సంస్కృత మైనచో దాని సాయమున శాఖాచంద్ర న్యాయమున ఫలవ్యాపృత్వాంశమును పురస్కరించు కొని ఆత్మ సాక్షాత్కారము కలుగునని చెప్పబడినది. అట్టి శమదమాది సంస్కారముల వంటి యొక సంస్కారము భక్తి. ఆత్మశ్రవణ మననినిధ్యాస నాది సహకృతమైన అట్టి భక్తి చిత్తమున (మనసున) ఆత్మ (అనుభవ) జ్ఞానరూప సాక్షాత్కారము కలిగిన మనశ్చక్రభ్రమణ మాగిపోవును. ఆగిపోయిన ఆ మనస్సు పూర్తిగా నాశనమగును. అదియే సంసారాంధకార వినాశము. దాని

భ్రమణ నిరోధములు విష్ణువు హస్తమున నున్నవి కావున విష్ణు స్తుత్యాత్మకమైన ఈ స్తోత్రమారంభింప బడినది. సంసారము చక్రము వంటిది. పరమేశ్వరుని చేతిలోని చక్రము జ్యోతీ రూపమైన సుదర్శన (ఆత్మ యొక్క మంచి దర్శనము) నామకమైన సంసార నాశకమైనది గావున అది సంసారాంధకార నాశక జ్యోతిశ్చక్రము అనియు అది భగవంతుని చేతనే అనుగ్రహింప దగినదనియు భావించి విష్ణుస్తుతి చేయ నారంభింపబడుచున్నది. హరి శబ్దము సంసార హరణార్థకము కావున సంసారహరణార్థము హరి నామక పరమేశ్వరస్తుతి ఆరంభింపబడుచున్నది. హరి యనగా పరమాత్మ చైతన్యము. దానితో తన యాత్మనేకమొనర్చు నీవిచారము స్తుతిరూపమే. అట్టి విచారణ మీ స్తోత్రమున నున్నది. కావున నీ స్తుతి హరిస్తుతియే. అదియే ఆరంభింప బడుచున్నది. ఆరంభింపబడినది.

అవతారిక:- ఈ శ్లోకమున సంసారము (భిన్నజగద్దర్శనము) భ్రాంతియని, దానికి సృష్టి స్థితిలయములు హరివలననే జరుగుచున్నవని చెప్పబడుచున్నది.

శ్లో॥ యస్యైకాంశా దిత్థ మశేషం జగ దేత
త్ప్రాదుర్భూతం యేన పినద్ధం పున రిత్థమ్।
యేన వ్యాప్తం యేన విబుద్ధం సుఖదుఃఖై
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 2

ప్రతిపదార్థము:-యస్య=ఎవని యొక్క, ఏకాంశాత్=ఒక అంశము నుండి, ఏతత్=ఈ, అశేషమ్=మొత్తము, జగత్=జగత్తు, ప్రాదుర్భూతమ్= ఆవిర్భవింప జేయబడినదో, యేన=ఎవని చేత, పునః=మరల, ఇత్థమ్=ఈ విధముగా, పినద్ధమ్= కప్పివేయబడినదో, యేన=ఎవని చేత, వ్యాప్తమ్= వ్యాపింపబడెనో, సుఖ దుఃఖైః= సుఖదుఃఖ (రూపము)లలో, విబుద్ధమ్ =తెలియ బడినదో, సంసారధ్వాంత వినాశమ్= సంసారాన్ధకారనివారకుడైన, తమ్=ఆ, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:-ఎవని ఏకాంశము నుండి ఈ మొత్తము జగత్తు ఆవిర్భవింప జేయబడినదో, అదే విధముగా అది మరల కప్పివేయబడినదో

ఎవనిచే వ్యాపింపబడియున్నదో సుఖదుఃఖరూపములలో నెవనిచే తెలిసికొన బడుచున్నదో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- పరమాత్మయైన హరి పెద్దవాని కంటె పెద్దవాడు. జీవుడు చిన్నవాని కంటె చిన్నవాడు. పరమాత్మ కంటె పెద్దవాడు గాని, జీవాత్మకంటె చిన్నవాడు గాని లేడు. పరమాత్మ జీవులిరువురు విభుపదార్థములు అనగా పెద్ద చిన్న కొలతల కందనివారని చెప్పుటలో నిది యొక వివరణాత్మక పద్ధతి. పైన జెప్పబడిన మహతోమహీయాన్ అణోరణీయాన్ అను శ్రుత్యర్థము పరమాత్మ యందు జీవాత్మయందు సమానముగానే సరిపోవుననుట మరొక వివరణాత్మక పద్ధతి. ఏది పెద్దవాని కన్న పెద్దదో మరియు చిన్నవాని కన్న చిన్నదో ఆ పదార్థ మొక్కటే జీవాత్మగా పరమాత్మగా వేరుపేర్లతో వ్యవహరించు చున్నట్లు కనబడినను పరమార్థముగా ఒక్కటే అనుట మరొక వివరణాత్మక పద్ధతి. మొదటి వివరణము జీవుని అత్యల్పతకు పరమాత్మ యొక్క అత్యధికత్వమును వ్యవహారసిద్ధములని తెలుపును. ఎంత చిన్నదానిలోనైనను దానికన్న చిన్న భాగములుండును. తాటి చెట్టెక్కువాని తలదన్నువాడుండు నట్లు ఎంత పెద్దదానికైనా మరొక పెద్దది యుండును. దేనికన్న పెద్దది లేక పోవుట దేనికన్న చిన్నది లేకపోవుట వాస్తవముగా పెద్దచిన్న కొలతలు లేనప్పుడే సంభవించును. రెండవ వివరణాత్మక పద్ధతి ఆ యిద్దఱి సమానత్వమును ఒకరెక్కువ ఒకరు తక్కువ అని చెప్పలేని ముక్త స్థితిని తెలుపును. చిన్న దనగానే పెద్దదానిలోని ఒక అంశమని మన మనస్సునకు స్ఫురించును. ఈ స్ఫురణ వ్యావహారిక సత్యాంశమును పురస్కరించుకొనినది. నిరంశమైన పరమాత్మయందు అంశములు కల్పింపబడినవి. అంశములు లేని పరమాత్మ కెన్ని అంశములు? ఇది యొక విచిత్ర ప్రశ్నము. పురుషసూక్తము ఈ యాత్మ చతురంశము అని 'పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి'. సమస్త భూతములు ఆ పరమాత్మ (పురుషుని) యొక పాదము మిగిలిన మూడు పాదములు అమృతములు అని ఋక్కు చెప్పినది. పాదశబ్దమునకు నాలుగవ భాగము అను అర్థముండుటచే (3+1) అను స్పష్ట విభాగము చేతను పై ఋక్కున కనుగుణముగా చతురంశ కల్పన యొక విధము. మాండూక్యోప నిషత్తు సోఽయమాత్మా చతుష్పాత్ అని స్పష్టముగానే చతురంశకల్పనమును చెప్పినది. ఈ అంశకల్పనము పురుషసూక్త చతురంశ కల్పనము వంటిది

కాదు. 1=4, ఇది తురీయము దీనిలో అనగా నాలుగింటిలో మూడు సంఖ్య విధిగా అంతర్భవించును ఎట్లు ! రూపాయలో ముప్పావలా ఉన్నట్లు. దీనిని 4-1=3 అని సూచింతము దీనిని ముప్పావలాగా పేర్కొందము. దీని పేరు అవ్యాకృతము మూడింటిలో రెండు అను సంఖ్య విధిగా అంతర్భవించును ఎట్లు? ముప్పావలాలో అర్ధరూపాయి ఉన్నట్లు ఇది హిరణ్యాగర్భ సంజ్ఞము. రెంటిలో విధిగా ఒకటి అంతర్భవించును ఎట్లు అర్ధ రూపాయి లో పావలా ఉన్నట్లు ఇది వైశ్వానర సంజ్ఞము. ఇచట నాలుగు భాగములు అనగా 1 రూపాయి 2 ముప్పావలా, 3 అర్ధరూపాయ, 4 పావలా, అను విభాగమును పోలినవి. 1) తురీయమును రూపాయని 2) అవ్యాకృతమును ముప్పావలా అని 3) హిరణ్యాగర్భమును అర్ధరూపాయి అని 4) వైశ్వానరమును పావలా అని పోల్చుకొని చతుష్పాద్బ్రహ్మ స్వరూపమును కొంచెమర్థము చేసికొన వచ్చును. మొదటిది మిగిలిన మూడింటిని, రెండవది మిగిలిన రెంటిని, మూడవది మిగిలిన ఒకదానిని లోగొని యుండును. నాల్గవది (వైశ్వానరము)లో గొనదగిన భాగమేదియు లేనిది. నాల్గవది మూడవ దానిని మూడవది రెండవ దానిని రెండవది మొదటి దానిని చేర్చుకొనును. మొదటి దానిలో మిగిలిన వన్ని ఉండును. దానికి తురీయము అని పేరు. పావలా నుండి లెక్క పెట్టినచో రూపాయ నాల్గవది అగును కావున ఉపనిషత్తు దానిని తురీయము (నాల్గవది) గా పేర్కొన్నది. దాని ప్రకారము వైశ్వానరము మొదటిది, హిరణ్యాగర్భము రెండవది, అవ్యాకృతము మూడవది, మొత్తము (పూర్ణము) నాల్గవది. ఇవి యన్నియు సమష్టులు అనగా వైశ్వానరునిలో విశ్వుడొక చిన్న అంశము, వ్యష్టి విశ్వులందఱు కలసి వైశ్వానర అని అనబడును. విశ్వుడు జాగ్రదవస్థాభిమాని. వ్యష్టి వైశ్వానరుడును జాగ్రదవస్థాభిమానియైనను సమష్టి హిరణ్యాగర్భునిలో తైజసుడొకచిన్న అంశము. తైజసులందరు కలసి హిరణ్యాగర్భ (సమష్టి) అనబడును. తురీయమున వ్యష్టి సమష్టి కల్పన మసాధ్యము అయినను కొందఱు వ్యష్టిని జీవాత్మయని సమష్టిని పరమాత్మ యందురు. సమష్టి అగ్ని వంటిది. వ్యష్టులు స్ఫులింగముల (మిణుగురుల) వంటివి. ఒక్క సమష్టిలో వ్యష్టులెందఱు లేక ఎన్ని అను ప్రశ్నము లేదు. ఉత్తరమును లేదు. ఈ విధముగా నిరంశమైన పరమాత్మయందు అనంతాంశములు కల్పింపబడినను ఈ శ్లోకమున పరమాత్మ యొక్క ఒక అంశము నుండి మనము చూడగా

చూడలేని సమస్త భూతములతో నిండిన జగత్తు పుట్టినది. అని పైన పేర్కొనబడిన ఋక్కు యొక్క అర్థమే ఈ శ్లోకమునందలి ప్రథమ పాదమున చెప్పబడినది. ఈ జగద్రచన మొక అల్పాల్పమైన విలాసభూతమైన నిశ్వాసమువలె అప్రయత్న (లేక సులభ) సాధ్యము వంటిదని చెప్పుట ఈ అంశ కల్పన ప్రయోజనము. ఇన్ని అనంతభూతములతో కూడిన జగత్తు ఎంత సులభముగా సృష్టింపబడినదో అదే విధముగా తిరిగి పినద్ధము చేయబడును. ఆవిర్భూత పినద్ధ శబ్దములు తెరవేయుట తొలగించుట ఎంత సులభమో పరమాత్మకీ సృష్టిలయము లనాయాస సాధ్యములనుటను సూచించు చున్నది. పరమాత్మ సాక్షాత్కరించినచో జగద్దర్శనముండదు. జగద్దర్శనము(భేదదర్శనము)న్నచో పరమాత్మానుభవ ముండదు. ఒక నాణెమున రెండువైపులవలె ఒక వైపు కనబడినప్పుడు మరొక వైపు కనబడనట్లు పరమాత్మ జగముల దర్శన మేర్పడును. అవి రెండును ఒక నాణెము యొక్క రెండు వైపులే వానిలో భేదము లేదు. భేదమును చూచుట భ్రాంతి. అభేదమును చూచుట పరమార్థ దర్శనము. రజ్జువు కనబడినచో సర్పము, సర్పము కనబడినచో రజ్జువును కనిపింపవుగదా, సర్పము కనబడినను మిథ్యయైనట్లు సర్పము వలె జగమును కనబడినను మిథ్యయే అధి వాస్తవమున బ్రహ్మమే. అంతట హరినామక బ్రహ్మమే నిండియున్నదని 'యేన వ్యాప్తమ్' అను పదములు తెలుపును. సంసారము సుఖదుఃఖరూపభ్రాంత్యను భవరూపము. భ్రాంతి తొలగిన ఏకరసమై పరమానంద రూపమైనది హరినామక బ్రహ్మమే అను స్వానుభవమును కలిగించు ఆ హరిని స్తుతించెదను. ఒక రజ్జ్వజ్ఞాని సర్పము నెంత సులభముగా సృష్టించునో పరమాత్మ ఏకాంశమునుండి ఈ జగము అంత సులభముగా సృష్టింపబడును. భ్రాంతి తొలగగానే సర్పమెంత సులభముగా (కఱ్ఱతో కొట్టి చంపవలసిన అవసరము లేకయే) లేకుండ పోవునో అంత సులభము గా జగముల లయము జరుగును. తనలో నుండి పుట్టిన సర్పమును రజ్జువు తనలోనికే లయించునట్లు పరమాత్మ ఏకాంశము నుండి పుట్టిన జగములు ఆ ఏకాంశములోనికే లయమగును. ఈ సృష్టిలయములు కల్పనామాత్రములే. సర్పము వలె సర్వ భూతములు పుట్టుటలేదు చచ్చుటలేదు.

అవతారిక:- ఈ శ్లోకమున ఈ సర్వము (దృశ్యము చూడదగినది)

దీనిని చూచు వాడును హరియేయని సగుణ నిర్గుణ వ్యష్టి సమస్టి వ్యక్తావ్యక్త స్థితులన్నియు ఆ హరియే యని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వజ్ఞో యో యశ్చ హి సర్వ స్సకలో యో
యశ్చానందో 2నంతగుణో యో గుణధామా।
యశ్చావ్యక్తో వ్యస్త సమస్త స్సదస ద్య
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 3

ప్రతిపదార్థము:- యః=ఎవడు, సర్వజ్ఞః=అన్నిటిని(అంతటిని) యెఱుగు వాడో, యః=ఎవడు, సర్వఃచ=అన్నియును (అంతయును) అగునో, యః= ఎవడు, సకలః=ప్రకృతి పురుష స్వరూపుడో, యశ్చ=ఎవడు, ఆనందఃచ= ఆనందమును అగునో, యః=ఎవడు, అనంతగుణః=అనంతగుణములు కలవాడో, యః=ఎవడు, గుణధామా=సత్త్వరజస్తమోగుణములు కలవాడో లేక నిర్గుణతేజస్వరూపుడో, యః=ఎవడు, అవ్యక్తఃచ=అవ్యక్తుడగునో, యః=ఎవడు, వ్యస్త సమస్తః=వ్యస్తుడు సమస్తుడునై యున్నాడో, యః=ఎవడు, సదసత్=సత్తు, అసత్తును అయి యున్నాడో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాంధ కార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:-ఎవడు సర్వము నెఱుగునో ఎఱిగిన సర్వమును అయి యున్నాడో ఎవడు కలలతో కూడిన వాడో, ఎవడు అవ్యక్తుడో, అనంతగుణుడు, గుణత్రయసహితుడును, నిర్గుణడునగుచున్నాడో,ఎవడు ఆనందస్వరూపుడో ఎవడు వ్యస్త సమస్త రూపుడో, ఎవడు సత్తు అసత్తును అయి యున్నాడో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఈ ప్రపంచమున రెండు స్పష్ట విభాగము లున్నవి.ఒకటి చూచునది మఱి ఒకటి చూడబడునది. ఇవి రెండును పరస్పర విలక్షణములు. అవ్యక్తాది పంచభూతాంత పిండాండ బ్రహ్మాండ భాగమంతయు దృశ్యము. చూడదగినది చూడబడినది చూడబడుచున్నది ఇంతవఱకు చూడబడినది ఇకముందు చూడబడదగినది అంతయు ఒక భాగమునకు చెందినది. ఇది జడము. మరొకటి దీని నంతయు చూచునది. ఇది యెందఱు జీవులలో నున్నను ఈశ్వరునిలోనున్నను అది యొక విభాగమునకు చెందినది. ఇది

చైతన్యము. ఈ చైతన్యము మనోబుద్ధీంద్రియములలో వ్యాపించి అవి చూచునవి యను భ్రాంతిని కలిగించుచున్నవి.జ్ఞాతృజ్ఞేయ విభాగము చక్కగా విచారించి మనోబుద్ధీంద్రియాదులు చేతనములు కావని గుర్తించి అవియు తనకు జ్ఞేయములేయని స్వస్వరూప చైతన్యము వీరికన్న భిన్నమని యెఱిగి ఇంతకు పూర్వము తన చేత ఎఱుగబడినదంతయు తానే అని భ్రాంతిచే భిన్నముగా దర్శించిన దానినంతను తనలో ప్రవిలాపన మొనరించి తన కేవలత్వమునందే సుప్రతిష్ఠితుడై యుండుటయే ముక్తి అనబడును. మనోబుద్ధీంద్రియ సంఘాతము నందు చైతన్యము వ్యాపించి యుండి జీవ వ్యవహారమును కలిగించినది. మాయయందు వ్యాపించి ఈశ్వర వ్యవహారమును కలిగించినది. చైతన్యమునకీ సంఘాతమాయలు మిథ్యలని గుర్తించి ఉభయగత చైతన్యమేకమైన తానే యని తన కేవలత్వమునందు సుప్రతిష్ఠుడై యుండుట ముక్తి అనబడును. జీవునందు కించిద్ జ్ఞత్వము ఈశ్వరునందు సర్వజ్ఞత్వము నున్నవి. ఏ జీవుడైనను తాను కించిద్జ్ఞుడనని నేను ఎన్నో విషయములను ఎఱుగను అని తలపోయును. ఈశ్వరుడనగా అన్ని యెఱిగినవాడు. ఈశ్వరుని గూర్చి ప్రతి జీవుడును ఈశ్వరుని విశ్వసించు అన్నిమతములలోని జీవులందఱును ఇట్లే విశ్వసించెదరు. కావున ఈ శ్లోకములో ఎవడు సర్వజ్ఞుడో వాడు హరి అని చెప్పబడినది. ఆ హరి తానెఱిగిన సర్వమును తానే అని యెఱుగును. ఆయన జ్ఞేయమంతయును తానే అయి యున్నాడు. జ్ఞాతయును జ్ఞేయమును ఆ హరియే. బుద్ధీంద్రియాది షోడశకమునకు కలలని పేరు. 'షోడశకలఃపురుషః' అను శ్రుతి ననుసరించి ఈ శ్లోకమున హరి సకలుడు కలలు కలవాడు అని చెప్పబడినాడు. విషయ జన్మ సుఖములు తాత్కాలికములే. నిర్విషయ సుఖము శాశ్వతము కావున అది ఆనందమని చెప్పబడినాడు. భగవంతుని గుణము లనంతములు. అవికాక సత్త్వ రజస్తమోగుణత్రయ మాతనికి కలదు కావున అనంత గుణుడని, గుణధామ అని చెప్పబడినాడు. అనంతగుణో గుణధామ అనుచోట అకార ప్రశ్లేష చేసి ఆయన నిర్గుణ తేజ స్వరూపుడని యర్థము చెప్పవచ్చును. సాధారణముగా ప్రకృతి అవ్యక్తమని చెప్పబడినది. అది యే మహదహంకార పంచ భూతేంద్రియాది రూపమున వ్యక్త మగును. అట్లు వ్యక్తము కాక పూర్వమది అవ్యక్తమని పేర్కొనబడును. వ్యక్తము కాక ముందు అనగా నిద్ర

ప్రలయస్థితులందు దానికి వ్యక్తిలేదు కావున అది అవ్యక్త మనబడుట సముచితమేకాని పరమాత్మ కూడ తాను ఎఱుగువాడే కాని జ్ఞేయమైన వ్యక్తముకాడు కావున ఆతనికిని అవ్యక్తుడు అను పేరు చెల్లును. ఏవస్తువు యొక్క జ్ఞానము కలుగునో అది వ్యక్తము అనబడును. ఎఱుగు వాడైన హరి ఎవరిచే నెఱుగబడును? 'విజ్ఞాతార మరే కేన విజానీయాత్' అని శ్రుతి ప్రశ్నించుచున్నది. ఆయన ఎఱుఁగఁబడిన వాడయి వ్యక్తుడగుట ఎన్నడును సంభవము కాదు గదా అందుచే నాతడెల్లప్పుడు అవ్యక్తుడే. ఇంతకు ముందు చెప్పఁబడిన ప్రకృత్యాది భూతేంద్రియాంత రూప జడమంతయు తెలియఁబడక అవ్యక్తమని తెలియబడి వ్యక్తము అని పిలువఁబడును. కాని హరి ఒకప్పుడు తెలియఁబడును అను స్థితి లేక ఎప్పుడు స్వయం ప్రకాశుడైయుండుటచే ఆయన వ్యక్తుడు కాడు, అవ్యక్తుడై ఎల్లప్పుడును ఉండును. ఇంద్రియ వేద్యములైన శబ్దస్పర్శాదులు సత్తులని ఇంద్రియ వేద్యములు కాని నిద్ర అసత్తని చెప్పఁబడును. పరమాత్మకన్న భిన్నమైనది లేదు కావున అంతయు పరమాత్మ యే కావున సత్తును అసత్తును హరియే ఐ యున్నాడు.సమస్తము పరమాత్మయే అయియుండగా దానిలోని వ్యస్తములన్నియు తద్రూపములే కావున ఆ హరియే వ్యస్తుడు సమస్తుడు. కావున వ్యస్తసమస్తుడని ఈ శ్లోకమున పేర్కొనఁబడినాడు. విభజింపఁబడినది వ్యస్తమని, విభజింపఁబడనిది సమస్తమని చెప్పఁబడను. సమస్తములోనివే విభాగము చేసి వ్యస్తములుగా వ్యవహరింపఁబడును. కావున హరియే వ్యస్తసమస్త రూపుడు. అట్టి సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హర్యాత్మ చైతన్య భిన్నముగా కనఁబడిన వేదియు పరమార్థము కాదని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ యస్మా దన్య న్నా స్త్యపి నేదం పరమార్థం
దృశ్యా దన్యో నిర్విషయజ్ఞాన మయత్వాత్।
జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయ విహీనోఽపి సదా జ్ఞ
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 4

ప్రతిపదార్థము:-యస్మాత్=ఎవనికన్న, అన్యత్=భిన్నమైనది, న

అస్తి=లేదో, ఇదమ్ అపి=(భిన్నముగా ననిపించబడు)ఇది కూడా, పరమార్థమ్= యథార్థము, న=కాదో, నిర్విషయజ్ఞానమయత్వాత్=విషయశూన్యమైన జ్ఞాన స్వరూపుడగుటచే, దృశ్యాత్=చూడ (తెలియఁ) బడుదానికన్న, అన్యః=భిన్నుడో, జ్ఞాతృజ్ఞానజ్ఞేయ విహీనః అపి=జ్ఞాతృజ్ఞానజ్ఞేయములు లేనివాడైనను, సదా= ఎల్లప్పుడు, జ్ఞః= తెలియువాడో, తమ్=ఆ, సంసారధ్వాన్తవినాశమ్= సంసారాన్ధ కార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఎవనికన్న వేత్రైనది పరమార్థము కాదో నిర్విషయ జ్ఞానరూపు డగుటచే తెలియఁబడువాడు కాడో తెలియఁబడుదాని కన్న భిన్నుడో, జ్ఞాత జ్ఞానము జ్ఞేయము (అను త్రిపుటి) ఎవనికి లేకున్నను ఎల్లప్పుడు తెలియువాడుగానే ఉండునో, ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- హరి పరబ్రహ్మము. ఆతనికి భిన్నమైనదేదియు లేదు. భిన్నముగా నున్నట్లు తెలియఁబడినది పరమార్థము కాదు. ఈ ప్రపంచము హరికన్న భిన్నముగా తెలియఁబడినను ఇది పరమార్థము కాదు. పరమార్థము కానిది తెలియఁబడుటెట్లు? లోకమున రజ్జువున పరమార్థము కాని సర్పమెట్లు తెలియఁబడుచున్నదో అట్లు ఆ సర్పము రజ్జు జ్ఞానము లేకపోవుట వలన అజ్ఞానికి తెలియఁబడుచున్నది. అంత మాత్రము చేత దానిని పరమార్థమన వచ్చునా, లోకమున అనుచున్నారా? అనఁగూడదు. లోకమునం దెవఱును అనుటయు లేదు. ఇట్లు లేకపోయినను ఉన్నట్లు కనఁబడు లేక తెలియబడు దానిని మిథ్య యందురు. సర్పము మిథ్య అట్లే పరమార్థము కాక పోయినను ఈ జగమున్నట్లు కనఁబడు (తెలియఁబడు) చున్నది. కావున సర్పము వలె ఈ జగమును మిథ్యయే, పరమార్థమైనచో అన్ని కాలము లందును అన్ని అవస్థలందును ఉండవలెను. కాలాంతరమున అనగా రజ్జుజ్ఞానము కలిగిన పిదప సర్పము లేదు కావున సర్పము మిథ్య యగుచున్నవి. అట్లే పరమార్థ హరి పరబ్రహ్మ జ్ఞానము కలిగిన పిమ్మట ఇప్పటి వఱకు మనకు తెలియఁబడిన ఈ ప్రపంచమంతయు హరి యందే భ్రాంతి వలన తెలియఁబడినది ఇప్పుడు భ్రాంతి తొలగినందున ప్రపంచము లేదు. ఒకప్పుడున్నట్లు తెలియఁబడిన సర్పము కాలాంతరమున తెలియఁబడక ఎట్లు లేని దగుచున్నదో ఈ

ప్రపంచమును అజ్ఞానదశయందు తెలియఁబడినను జ్ఞానము కలిగిన పిదప తెలియఁబడుట లేదు కావున ఇది లేనిదే అగుచున్నది. ఉన్న దనగా అన్ని కాలములలో ఉన్నదేకాని ఒకప్పుడుండి ఒకప్పుడు లేని దానిని ఉన్నదనుట సరికాదు. స్వప్నావస్థయందు ఏనుగు కనఁబడినను జాగ్రదవస్థ యందు కనఁబడదు. కనఁబడిన ఆ స్వప్నావస్థ యందు ఉండెనని చెప్పుదుమా! చెప్పము. ఏల?అంత చిన్న గదిలోని కేనుగెట్లు వచ్చినది. ఒకవేళ వచ్చియున్నచో ఇప్పుడది యేల కనఁబడ కుండును కావున కలలన్నియు మిథ్యయే. అట్లే అజ్ఞాన దశయందు కాననగు నీ ప్రపంచము బ్రహ్మజ్ఞానానంతరము కనఁబడదు. కనఁబడిన పూర్వ (అజ్ఞాన) దశయందును అది లేనిదే. ఒకప్పుడు మాత్రమే కనఁబడు పదార్థము మిథ్యయని స్పష్టమైనది. ఈ జగము జాగ్రదవస్థలో మాత్రము కాననగును. నిద్రాస్వప్నావస్థలలో కానరాదు. స్వప్నావస్థలో కాన (తెలియ) వచ్చి జాగ్రదవస్థలో కాన (తెలియ)రాని ఏనుగు త్రికాలములందును లేనిదానిని గానే నిశ్చయించుకొన్నాము గదా. అట్లే జాగ్రదవస్థలో మాత్రమే కాన (తెలియ) వచ్చు ఈ జగము నిద్రావస్థలో కాని స్వప్నావస్థలో కాని కాన (తెలియ) రానిదే కావున ఈ జగము త్రికాలములలో లేనిదే అని నిశ్చయించు కొనవలెను. నిద్ర (అజ్ఞానము)ను స్వప్నమును జాగ్రద్దశను దర్శించు ఆత్మ అన్ని కాలములలో నున్నది. కావున అది నిద్రయందు దృశ్యమైన అజ్ఞానమున కన్న స్వప్నావస్థ యందు కాన (తెలియ) వచ్చు గజాదుల కన్న జాగ్రదవస్థ యందు కాన (తెలియ) వచ్చు ప్రపంచమునకన్న ఆత్మరూపుడైన హరి భిన్నుడే. ఈమూడు దశలలో విషయములున్నట్లు తెలియబడినవి దృశ్యములు మాత్రమే. పరమార్థములు కావు. ఈ విషయములు లేని సమాధి యందు, విషయములున్న ఈ మూడు అవస్థలయందును, హరి నిర్విషయ జ్ఞాన మయుడయియే యున్నాడు. విషయములు ఒకప్పుడుండుట ఒకప్పుడు లేకపోవుట అనగా ఉన్నట్లు తెలియఁ బడుట లేనట్లు తెలియఁబడుట యున్నవి. కాని(నిర్విషయ) జ్ఞానము సార్వ కాలికము కావున అది యొక్కటియే పరమార్థము. ఆ పరమార్థవస్తువే హరి. పరబ్రహ్మము ఉన్నట్లు అనిపించుట లేనట్లనిపించుట తాత్కాలికముగా విషయములున్న వను వ్యవహారమునకు విషయములు లేవను వ్యవహారమునకు మూలములే. కాని అంతమాత్రమున అవి పరమార్థములని చెప్పరాదు. హరి యొక్కడే పరమార్థము. తదితర

మంతయు పరమార్థము కాదు. అను జ్ఞానము కలిగినచో సంసారాన్ధకారము నశించును. ఈ జ్ఞానము కలిగించువాడు హరి. అందుచేత ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి తత్త్వ జ్ఞానము లభించుట యెట్లో చెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఆచార్యేభ్యో లబ్దసుసూక్ష్మాచ్యుత తత్త్వా
వైరాగ్యేణాఽభ్యాస బలాచ్చైవ ద్రఢిమ్నా।
భక్త్యైకాగ్రధ్యానపరా యం విదు రీశం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 5

ప్రతిపదార్థము:- ఆచార్యేభ్య:=ఆచార్యులనుండి, లబ్దసుసూక్ష్మాచ్యుత తత్త్వా= పొందఁబడిన మిక్కిలి సూక్ష్మమైన హరి యొక్క తత్త్వముకలవారు, వైరాగ్యేణ =వైరాగ్యముతో, అభ్యాస బలాత్ చ=అభ్యాస బలమువలనను, ద్రఢిమ్నా=దార్ఢ్యము చేతను, భక్త్యా=భక్తి చేతను, ఏకాగ్రధ్యానపరాః=ఏకాగ్రధ్యాన నిష్ఠులు, యం ఈశమ్=ఏ శ్రీహరి, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసార ధ్వాన్త వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ఆచార్యుల నుండి అచ్యుతుడైన హరి యొక్క మిక్కిలి సూక్ష్మమైన తత్త్వమును పొందిన వారు, వైరాగ్యముతో అభ్యాస బలముతో దార్ఢ్యముతో భక్తితో ఏకాగ్రధ్యాననిష్ఠులై ఏ ఈశుని తెలిసికొందురో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- అచ్యుతమైన తత్త్వము హరి తత్త్వము. హరి అచ్యుతుడు ఆయన తత్త్వము అచ్యుతము. ఇది ఎచట లభించును. ఆచార్యులకడ లభించును 'ఆచార్యవాన్ పురుషో వేద' అను శ్రుతి వచనము ఈ తత్త్వము ఆచార్యులనుండి పొందదగినదని చెప్పుచున్నది. 'యస్య దేవే పరాభక్తి: యధాదేవే తథాగురౌ తస్యైతే కథితాహ్యర్థా: ప్రకాశంతే మహాత్మన:' (ఎవనికి దేవుని యందు గురువు నందును ఉత్కృష్ట భక్తి ఉన్నదో అట్టి మహాత్మునకు ఆ గురువుచే చెప్పఁబడిన అర్థములు అనుభవమునకు వచ్చును' అను

వచనమును ఆచార్యుల వలన పొందఁబడిన తత్త్వ జ్ఞానము ఫలించునని సూచించుచున్నది. ఆచార్యుల నాశ్రయించి తత్త్వజ్ఞానమును పొందినవారు మందవైరాగ్యులైనచో వైరాగ్యము లేనివారైనచో వారికి తన (ఆత్మ) యందు హరైక్యము భాసించదు. తీవ్రవైరాగ్యమును సంపాదించుకొనవలెను. అది యెట్లు కలుగును? ఈ సంసారమున మనము అనుభవించు జరామరణ క్షణికత్వాదిదోషములను మనసునకు పట్టించుకొన్నచో ఎవరికైనను సంసారము నందు వైరాగ్యము కలుగును. వైరాగ్యము లభించినను ప్రతిదినము నియతముగా కొంతకాలము అభ్యాసము చేయనిచో తనయందు హరైక్యము భాసించదు. 'అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః' (అభ్యాస వైరాగ్యములతో చిత్తవృత్తులనిరోధము సాధ్యమగును) అని పాతంజల యోగసూత్రము బోధించుచున్నది. ఆచార్యులు బోధించిన 'హరి తప్ప అన్యము లేదు' అను తత్త్వమున దృఢనిశ్చయము కలుగవలెను. నిశ్చయము కొంతకాలముండునది కాక బహుకాలముండునది కావలెను. నిశ్చయము నందు దృఢత్వమున్నప్పుడు అది బహుకాల ముండును. అందుచేత శ్లోకమున నిశ్చయమున ద్రఢిమ కావలెనని చెప్పఁబడినది. హరియందు ప్రేమ లేనిదే అనగా భక్తిలేనిదే హరీతర ప్రపంచమునందు వైరాగ్యము తీవ్రము కాదు. భక్తితో వైరాగ్యమును తీవ్రమొనర్చుకొన్న పిదప సాధకుడు ధ్యాన యోగపరుడు కావలెను. ఆచార్యులను విచారించి ఆత్మజ్ఞానమును పొందవలెను. ఆచార్యులను విచారించుటయే శ్రవణము అనఁబడినది. ఉపనిషత్తున ఆత్మ (హరి) శ్రోతవ్యుడు అని చెప్పఁబడినది. శ్రోతవ్యుడు అనగా వినఁదగిన వాడు. అనగా విచారింపఁదగిన వాడు అని అర్థము. విన్న దానిని యుక్తులతో చింతించవలెను. ఇది మననము. ఆత్మమన్తవ్యుడు అనగా యుక్తులలో చింతింపఁదగిన వాడు అని శ్రుతి చెప్పినది. ఆ పిదప ధ్యానయోగపరుడు కావలెను. శ్రుతి నిధి ధ్యాసితవ్యః ఆత్మ (హరి) ధ్యానింపఁదగినవాడు అని చెప్పినది. ఇట్లు శ్రవణమననానంతరము హరి (ఆత్మ) ధ్యానమొనర్చవలెను. కొందఱు మనన ధ్యానముల అనంతర మొనరించిన విచార రూప శ్రవణము వలననే హరిజ్ఞానము కలుగునందురు. తైలధారవలె అవిచ్ఛిన్నముగా భావించుట ధ్యాన మనఁబడను. భావనమనగా జ్ఞానముల ధార. ధ్యాన కాలమున ఇతర విషయములతో విక్షేప ముండగూడదు. 'హరి' మాత్రమే తన జ్ఞానములందు

విషయమై యుండవలెను. ఇట్టి జ్ఞానముల ధారయే ధ్యానమనఁబడును. పైన చెప్పిన భావన మవిచ్ఛిన్నముగా ఉండవలెను. హరివిషయక జ్ఞానముల ధార అవిచ్ఛిన్నముగా ఉండవలెను. ఈ ధ్యానములోని జ్ఞానము మానసిక వ్యాపార రూపము. ఇది ఆత్మయందు హర్యైక్యానుభవము కాదు. అది కలిగిన పిదప ధ్యానమును ఆవశ్యకము కాదు. ఈ ధ్యానము ఆ అనుభవము నకు వైరాగ్యాదులవలె పరంపరా సాధనము మాత్రమే. ఇట్లు ధ్యానించిన వారికి తమ ఆత్మయందు హర్యైక్యాను భవము కలుగును. ఏ హరి ఇట్టి ధ్యాన యోగ పరుల అనుభవ రూపము నందునో వారికి సంసారాన్ధకారము నశించును. ఎవనిని తెలిసికొనిన (అనుభవించిన) సంసారాన్ధకారము నశించునో ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:-ఈ శ్లోకమున ధ్యానమెట్లు చేయవలెనో చెప్పఁబడు చున్నది.

శ్లో॥ ప్రాణా నాయ మ్యో మితి చిత్తం హృది రుద్ధ్వా
నాన్య త్స్మృత్వా తత్పున రత్రైవ విలాప్య।
క్షీణే చిత్తే భాదృశి రస్మీతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 6

ప్రతిపదార్థము:- ఓమ్ ఇతి=ఓంకారము నుచ్చరించి, ప్రాణాన్=ప్రాణమును, ఆయమ్య=బాగుగా బంధించి, చిత్తమ్=చిత్తమును, హృది=హృదయమునందు, రుద్ధ్వా=నిశ్చలమొనరించి, అన్యత్=ఇతరమును, నస్మృత్వా = స్మరించక, పునః=అటువెనుకను, తత్=దానిని, అత్ర ఏవ=దీని (ఆత్మ యందే), విలాప్య=లీనమొనరించి, చిత్తే=చిత్తము, క్షీణే(సతి)=క్షీణము కాగా, భాదృశిః= జ్ఞానప్రకాశరూపుడనై, అస్మి=ఉన్నాను, ఇతి=అని, యమ్=ఎవనిని విదుః=తెలిసికొనుచున్నారో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్=సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఓంకారము నుచ్చరించుచు ప్రాణాయామ మొనర్చి చిత్తమును హృదయమునందు బంధించి ఇతరమును తలచక, దానిని తన ఆత్మయందే లీన మొనరించి చిత్తము క్షీణముకాగా జ్ఞానప్రకాశ రూపుడను అని యెవనిని తెలియుదురో ఆ సంసారాన్ధకార వినాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- శ్రీమద్భగవద్గీత 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్' (ఏకాక్షర బ్రహ్మమైన ఓంకారము నుచ్చరించుచు) అని ఓంకారోచ్చారణము సాధకుల కావశ్యకమని చెప్పుచున్నది.ఓంకారోచ్చారణమునకు ప్రాణాయామమున వినియోగము సంధ్యోపాసనారంభమున చెప్పఁబడినది. అమంత్రకముగా ప్రాణాయామము చేయవచ్చును. అమంత్రక ప్రాణాయామ మునకన్న సమంత్రక ప్రాణాయామము శ్రేష్ఠము. ఓంకారపూర్వక సప్త వ్యాహృతులు ఓంకారపూర్వక గాయత్రీ మంత్రము అద్యంతములో ఓంకారముగల గాయత్రీ శీర్షమును మొత్తము కలసి దశప్రణవ గాయత్రి అని చెప్పఁబడును. గృహస్థుల ప్రాణాయామమున దీనికి వినియోగము శిష్టాచారప్రాప్తమై యున్నది. సన్యాసులకు మాత్రము ప్రాణాయామమున ఓంకారమునకే వినియోగము. ప్రాణాయామము నకు ముందు ఓంకారమును బిగ్గరగా నుచ్చరింపవలెను. ప్రాణాయామ సమకాలమున ఓంకారమునకు మానసికోచ్చారణ ముండవలెను. ప్రాణాయామము త్రివిధముగా చెప్పబడినది. పూరకము కుంభకము రేచకము ఈ మూడును కలిపి ఒకే ప్రాణాయామముగా చెప్పుట కూడ కలదు. ఒక పర్యాయము పై మూడింటిని ముగించి మరల పూరకము నారంభించుటకు ముందు కొంత సేపు గాలిని బయటనే ఉంచవలెను. దీనిని రిక్తకమని కొందఱు పేర్కొందురు. కుంభకమున గాలి లోపల బంధింపఁబడును. ఆ కుంభక కాలమును క్రమముగా శక్తి కొలది మెల్లమెల్లగా పెంచుకొనుచు పోవచ్చును. గాలి యాడుట ఆగిపోయినచో మనస్సు యొక్క చలనమును ఆగిపోవును. 'చలేవాతే చలం చిత్తం నిశ్చలే నిశ్చలం స్మృతమ్' అని యోగశాస్త్రము చెప్పుచున్నది. ఇట్లు చిత్త నిరోధమునకు సాధనములైన అష్టాంగములలో ప్రాణాయామము ముఖ్య స్థానము వహించును. 'చిత్తంతు చేతో హృదయం స్వాన్తం హృన్మానస మ్మనః' అను నిఘంటువు 'చిత్తము హృదయము హృత్' పర్యాయములని చెప్పుచున్నను 'ఆత్మరక్ష'లో మనోహృదయే అని మనస్సు హృదయము వేఱువేఱు అని చెప్పుచున్నది. ఈ శ్లోకమున చిత్తమును హృత్తునందు బంధించి అని హృదధికరణక చిత్తబంధమును చెప్పుటచే అధికరణమైన హృదయమునకన్న ఆధేయమైన చిత్తము వేఱని తెలియుచున్నది. హృత్తనగా ఒక నాడియని దానిలోనికి చిత్తమును పంపినప్పుడది నిశ్చలమగునని కొందఱు చెప్పుదురు. 'మూర్ధ్ని

ఆధాయ ఆత్మనః ప్రాణమ్' అను భగవద్గీతవాక్యము మూర్ధమున (భ్రూమధ్యమున) ప్రాణాయామ యొక్క ఆధానమును చెప్పుచున్నది. కావున ప్రాణాయామము భ్రూమధ్యమున చేయఁదగినది అను భగవద్గీతా వచానాను సారమే ఇచట ప్రాణాయామము భ్రూమధ్యమునందే అని నిశ్చయించు కొనవచ్చును. 'హృత్తునందు ఈ భగవంతుడుండును' (హృది అయకు) అను హృదయ శబ్దవ్యుత్పత్తి ననుసరించి హృత్తునందలి ఆత్మయందే చిత్తమును బంధించవలెను. అనగా నిశ్చల మొనర్చవలెను. ఆ సమయమున ఇతరము నేమియు తలపరాదు. ఆత్మసంస్థ మ్మనః కృత్వా న కించిదపి చింతయేత్ ఆత్మయందు సంస్థ (చావు) కలదానినిగా చేసి వాడేమియు చింతింపకూడదు). అను భగవద్గీతా వచనముననుసరించి ఇచ్చట హృది పదమునకు హృత్తునందున్న ఆత్మయందు అను అర్థము చెప్పవలెను. సంస్థా శబ్దమునకు 'చావు' అను అర్థము రూఢముగానే ఉన్నది. దీనికి లీన మొనరించుట అని అర్థము. ఈ అర్థము ప్రవిలాప్య అను పదముతో ఈ శ్లోకమున చెప్పఁబడినది. ఒక్క చిత్తమునకే ప్రవిలాపముకాదు. చిత్తమనగా మొత్తము సంసారమే. చిత్తము లీనమైనదనగా మొత్తము సంసారము లీనమయినట్లే. ఇట్లు చిత్తము క్షీణించగా దగ్ధముకాగా లేక దగ్ధపట సదృశముకాగా 'జ్ఞాన ప్రకాశ హరిని నేను' అను హరి యొక్క యథార్థ జ్ఞానముచే మనసునకీ స్థితి కలుగును. ఈ జ్ఞానము కలిగిన సంసారాన్ధకార నాశనము కలుగును. అందువలన ఇట్టి జ్ఞానము కలిగించి సంసారాన్ధ కారమును నశింపజేయు హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ధ్యానము నిర్గుణ ధ్యానముగా వర్ణింపఁ బడుచున్నది.

శ్లో॥ యం బ్రహ్మాఖ్యం దేవ మనన్యం పరిపూర్ణం
హృత్స్థం భక్తై ర్లభ్య మజం సూక్ష్మ మతర్క్యమ్।
ధ్యాత్వా 22త్మస్థం బ్రహ్మవిదో యం విదు రీశం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 7

ప్రతిపదార్థము:- బ్రహ్మాఖ్యమ్=బ్రహ్మమను పేరుగల, దేవమ్= ప్రకాశ

స్వరూపుడైన, అనన్యమ్=ఇతరముకాని, పరిపూర్ణమ్=పరిపూర్ణమైన, హృత్థమ్= హృత్తునందున్న, భక్తైః=భక్తులచే, లభ్యమ్=పొందదగిన, అజమ్=పుట్టుకలేని, సూక్ష్మమ్=సూక్ష్మమైన, అతర్క్యమ్=తర్కమునకందని, ఈశమ్=ఈశుడైన, యమ్=ఎవనిని, ధ్యాత్వా=ధ్యానించి, ఆత్మస్థమ్=తమయందున్న, యమ్= ఎవనిని, బ్రహ్మవిదః=బ్రహ్మవేత్తలు, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్ =సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- బ్రహ్మమను పేరుగల, ప్రకాశరూపుడైన, అన్యము లేని పరిపూర్ణుడైన హృదయము నందున్న భక్తులచే పొందదగిన, పుట్టుకలేని, సూక్ష్మమైన, తర్కమునకందని ఎవనిని ధ్యానించి, తమలోనున్న వానినిగా తెలిసికొందురో, అనగా బ్రహ్మవిదులగుదురో, ఆ సంసారాన్ధకారనాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- హరికి బ్రహ్మమను పేరున్నది కావున హరి నెఱిగినవారు బ్రహ్మవేత్తలు, బ్రహ్మమను పేరే వేదము (వేదాంతము)లలో ప్రచారముగా నున్నది. హరియను పేరు పురాణములలో ప్రచురముగానున్నది. పేరేదైనను అర్థమొక్కటే. అది ప్రకాశాత్మకము. దేవ శబ్దమునకు ప్రకాశించు అని అర్థము. దానికి అన్యము లేదు కావున అది అనన్యము. అన్యము లేక పోవుటచేతనే అది పరిపూర్ణమని చెప్పఁ బడినది. సంసారమంతయు హృత్తు (మనసు) నందున్నది. సంసార సహితమైన హృత్తున కధిష్ఠానమైన చైతన్యము, సంసారమునందును హృదయమునందును వ్యాపించి అవిచ్ఛిన్నమైనదిగా తోచినను అది అధిష్ఠానమున కన్న భిన్నముకాదు. చైతన్యము కన్న అన్యముగా తోచు నీ సంసారము మిథ్య గావున రజ్జువు నందు చూడబడు సర్పము రజ్జువు కన్న అన్యము కానట్లు చైతన్య రూపుడైన హరి అధిష్ఠానముగా అధేయముగాను ఉండుటచే పరిపూర్ణమని చెప్పబడుట సముచితముగా నున్నది. హృత్తునందున్న హరియందు హృత్తునుంచుట భక్తి, అనగా సంసారమునందుండిన హృత్తును సంసారము నుండి తొలగించి హరి యందు చేర్చుట భక్తి. హృత్తులో వ్యాపించియున్న చైతన్యమే తాను. హరియు ఆ చైతన్యమే. ఆ హృద్గత చైతన్యమున జీవేశ్వరుల నైక్యమొనరించుట భక్తి. ఈ భక్తి జ్ఞానరూపము. ఇట్టి జ్ఞానమునకు భక్తికి భేదము లేదు. భగవద్గీత జ్ఞాన

భక్తుని పేర్కొనుట ఈ అభేదమును పురస్కరించుకొనియే. స్వస్వరూప మేమి అది హరికి భిన్నమా? 'వాసుదేవః సర్వమ్' అని భగవద్గీత చెప్పుచున్నది. సర్వమైన వాసుదేవునకు స్వస్వరూపము (తన స్వరూపము) భిన్నమనుట 'వాసుదేవః సర్వమ్' అను భగవద్గీతా వచనమునకు విరుద్ధము. తాను పుట్టినాననుట సర్వజీవానుభవసిద్ధము. అయినను జీవునకే జన్మలేదని ద్వైత శాస్త్రములుకూడ చెప్పుచున్నవి కావున జీవుడు అజుడనుట బహుసమ్మతము. హరి అజుడనుటలో విప్రతిపత్తియే లేదు. జీవ స్వరూపము సూక్ష్మము. హరి స్వరూపము కూడ సూక్ష్మము అని ద్వైతులును ఒప్పుకొందురు. కావున హరి అజత్వ సూక్ష్మత్వములు నిర్వివాదములు. కించిద్జ్ఞుడు జీవుడు. సర్వజ్ఞుడు హరి. కించిత్త్వ సర్వత్వాద్యంశముల తొలగించినచో జ్ఞత్వ మేకరూపమే. దృశ్యమైన సర్వమును మిథ్యయే కావున తొలగింపదగినది. జ్ఞత్వ మొక్కటే త్రికాలాబాధ్యము. జ్ఞత్వమువలె అజత్వ సూక్ష్మత్వాదులు నేకరూపములే. జీవేశ్వరులను వేరుగా చూపించు మనసు నాత్మలో ప్రవిలాపనము చేసినచో నిక జీవేశ్వర విభాగమెక్కడిది. తాత్కాలిక వృత్తినిరోధ రూపమైన నిద్రయందే జీవేశ్వర విభాగము లేకపోగా తత్త్వమసీత్యాది వాక్యార్థ జ్ఞానాగ్నిచే సమూలము (కారణాజ్ఞాన సహితము)గా మనస్సు దగ్ధము కాగా దగ్ధపట సదృశము కాగా జీవేశ్వర విభాగ మెట్లుండును. ద్వైతశాస్త్రములైన వైశేషిక న్యాయదర్శనవేత్తలు ఈశ్వరుని నిరూపించు తర్కము చేయుదురు. అది వేదసిద్ధుడైన ఈశ్వరుని స్థాపించునదగుటచే ఆ తర్కము వేద సమ్మత మగుటచే ప్రమాణమే కాని 'ఏకమే వాద్వితీయం బ్రహ్మ' అను శ్రుతి సిద్ధమైన అద్వైతమును ఖండించుట కొఱకు ద్వైతశాస్త్రములలోని తర్కము అప్రమాణమే అగును. మరియు వారు ఈశ్వరునందు గుణముల నంగీక రించెదరు. తర్కసిద్ధమైన ఈశ్వరునందు గుణములు అనివార్యములు గా వారికి తోచినవి. శ్రుతి అతనిని నిర్గుణునిగా చెప్పుచున్నందున నిర్గుణ బ్రహ్మను సాధించుటలో తర్కము సమర్థమగుటలేదు. అందు వలన హరి ఈ శ్లోకమున అతర్క్యుడని చెప్పబడినాడు. జగత్తు యొక్క సత్యత్వము కార్యత్వమును పురస్కరించుకొని కర్తృ కార్యావినాభావము ననుసరించి అనగా కర్తలేనిదే కార్యముండదు అను వ్యాప్తి ననుసరించి కర్తను ఈశ్వరుడని వారు నిరూపించు చున్నారు. కాని వాస్తవమునకు జగత్సత్యత్వమునే తిరస్కరించుచు

సర్వం ఖల్విదమ్ బ్రహ్మ అని వేదము సర్వము బ్రహ్మమని చెప్పుచుండగా ఇట్టి సర్వాత్మక బ్రహ్మమును వారి తర్కమెట్లు సాధించగలదు. అందువలన హరి అతర్క్యుడని ఈ శ్లోకమున చెప్పబడినాడు. అజుడనగా జన్మలేనివాడు అనుటలో జన్మాది షడ్భావవికారము లేవియు లేవని, సూక్ష్మమనుటచే ఇంద్రియ వేద్యములైన శబ్దస్పర్శాదిగుణములు లేవని చెప్పబడినట్లైనది. అతర్క్యమనుటలో ఆయన యందలి జగన్నిర్మాణాదికర్మలుకాని తన్మూలము లైన సత్త్వరజస్తమో గుణములు లేవని చెప్పబడినట్లైనది. పరిపూర్ణమ్ అనుటచే దేశకాలవస్తు పరిచ్ఛేదములు లేవని చెప్పబడినట్లైనది. హరి బ్రహ్మాఖ్యుడని చెప్పుట వలన ఆతనికి హరి బ్రహ్మ ఇత్యాది నియత సంజ్ఞలు లేవని చెప్పబడి నట్లైనది. ఆత్మస్థమ్ అని ఆత్మగానే ఉన్నాడనుటచే ఆయనకు లోకాంతర ప్రాప్యమైన అపరబ్రహ్మత్వ మాతనికి లేదని చెప్పబడినట్లైనది. ఇట్లు సర్వగుణ నిరాకరణరూపమున ధ్యానించి స్వాత్మగా నెవని నెఱిగిన బ్రహ్మవేత్తలనబడు చున్నారో అట్టి సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి యొక్క ధ్యానావస్థలో మరియు జ్ఞానము కలిగిన పిమ్మట ఆనందము కలుగుట చెప్పబడుచున్నది.

శ్లో॥ **భావాతీతం స్వాత్మవికాసాత్మ విబోధం**
**జ్ఞేయాతీతం జ్ఞానమయం హృ ద్యుపలభ్య।**
**భావగ్రాహ్యానంద మనన్యం చ విదు ర్యం**
**తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥** 8

ప్రతిపదార్థము:- భావాతీతమ్=మనసునకందని, స్వాత్మవికాసాత్మ విబోధమ్=తన మనస్సు యొక్క వికాసము వలన కలుగు ఆత్మజ్ఞాన రూపుడైన, జ్ఞేయాతీతమ్=జ్ఞేయమున కతీతుడైన, జ్ఞానమయమ్=(నిర్విషయ) జ్ఞానమయునిగా, హృది= బుద్ధియందు, ఉపలభ్య=పొంది, భావగ్రాహ్యానందమ్ = మనసుతో గ్రహించ దగిన ఆనందము (స్వరూపముగా) గల, అనన్యమ్= (తనకు) అభిన్నునిగా, యమ్=ఎవనిని, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్ = సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:-మనసున కతీతుడైన, తమ మనస్సుల యొక్క వికాసముల వలన కలుగు ఆత్మజ్ఞానము స్వరూపముగా గల జ్ఞేయమున కతీతుడైన నిర్విషయ జ్ఞానస్వరూపునిగా, బుద్ధియందు సాక్షాత్కరించుకొని మనసున తెలియదగిన ఆనందరూపుడైన ఎవనిని స్వాభిన్నునిగా నెఱుగుదురో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- భావగ్రాహీ జనార్ధనః ఇత్యాది ప్రయోగములలో భావ శబ్దము గౌరవము వాత్సల్యము ఆర్జవము ప్రేమ ఇచ్ఛ మొదలగు భావములను బోధించును. నిర్గుణ బ్రహ్మ ఈ భావములకును అతీతమే. భావ శబ్దము రత్యాది స్థాయి భావముల బోధించునని కొందరు చెప్పుదురు. మహాభావ స్వరూపిణి రాధ ఇత్యాది ప్రయోగములలో అది ప్రేమను బోధించును. నిర్గుణ బ్రహ్మ ఈయన. భావనము లకును అతీతమే. చిత్తమున నిలచునది భావమని నిర్గుణ బ్రహ్మను నిలుపుట అసాధ్యము కావున అది భావాతీతమని ఈ శ్లోకమున చెప్పబడినది. నిర్గుణ బ్రహ్మను తెలిసికొను మార్గము దుర్గమమని పెద్దలు చెప్పుచున్నారు. 'క్షుర స్యధారా నిశితా దురత్యయా దుర్గమ్ పథ స్తత్కవయో వదన్తి' కత్తి అంచువలె ఆ మార్గము దుర్గమము అని ఉపనిషత్తు చెప్పినది. తన మనస్సును వికసింపజేసికొన్నచో ఆత్మజ్ఞానము కలుగును అని ఈ శ్లోక ప్రథమ పాదమున చెప్పబడినది. మనసును వికసింపజేసి కొనుట బుద్ధిని పదును పెట్టుకొనుట మొదలగు మాటలు దుర్జ్ఞేయ విషయ జ్ఞానమును సంపాదించు ప్రయత్నములను పేర్కొనుచున్నవి. అంతః కరణము విషయాకారమును ధరించినప్పుడు తదవచ్ఛిన్నత చైతన్యమున కలుగును. ఒక విషయము జ్ఞేయమగునప్పుడు కలుగు స్థితి యిది. అప్పుడు విషయము నావరించిన అజ్ఞానము తొలగి విషయము జ్ఞేయమగును. ఆత్మయే జ్ఞాత. ఆత్మజ్ఞానము అను మాట ఆ జ్ఞానము కలిగిన ఆత్మ నాకు తెలియ బడినది అను అనువ్యవసాయము. విషయము జ్ఞేయమైనప్పుడు కలిగినట్లు కలుగదు. నేను ఆత్మను తెలిసికొంటిని అను అనువ్యవసాయము కలిగినదని యెవడైన చెప్పినచో వానికాత్మ తెలియలేదు అని 'యస్యామతం తస్యమతమ్' అను శ్రుతి వాక్యము తెలుపుచున్నది. కావున ఈ శ్లోకమున ఆత్మ జ్ఞేయాతీత మని చెప్పబడినది. ఇచట జ్ఞేయబ్రహ్మము జ్ఞాతృస్వరూపమే అనుటచే వృత్తి వ్యాప్యత ఉన్నది. కాని ఫల వ్యాప్యత లేదు. ఫల వ్యాప్యత అనగా నాకాత్మ

తెలిసినది అను అవ్యవసాయమే. భగవద్గీతలో బ్రహ్మను జ్ఞానగమ్యము, జ్ఞేయము అను పదములలో పేర్కొన్నను అది జ్ఞానరూపమనియే చెప్పినది. కావున ఆత్మరూప హరి జ్ఞేయాతీతుడని చెప్పుచు జ్ఞానమయుడని రెండవ పాదము చెప్పుచున్నది. ఇది వరకు ఈ శ్లోకము వివరణము నారంభించు నప్పుడు భావగ్రాహీ జనార్దనః అను వాక్యము పేర్కొనబడినది. మూడవ పాదము ఆతడు భావగ్రాహ్యానంద రూపుడని చెప్పుచున్నది. దీనివలన గ్రహణమే ఆనందము కాని ఆనంద గ్రహణము వేరుగా లేదని గుర్తింపవలెను. అట్లు గుర్తించనిచో ఆత్మరూపహరి అనన్యుడని చెప్పుట పొసగదు. ఆత్మ చిద్రూపము ఆనందరూపమును. హరిచిత్తే (గ్రహణము జ్ఞానము) ఆనందము ఏకములనుట. ఆనందమును గ్రహించుట అను వాక్యమున విషయ విషయి భావము లేదు. విషయహీన జ్ఞాన మంతఃకరణము నందేర్పడుటయే ఆనందానుభవము. ఇతర విషయ గ్రహణముల వలన కలుగు సుఖము అనుకూలముగా వేదనీయమగుట, దుఃఖము ప్రతికూలముగా వేదనీయ మగుట. ఇచట విషయ విషయిద్వయ మాత్మయే గావున అనుభవము ఆనంద రూపము ఇట్లనన్య స్వాత్మా నందరూప జ్ఞాన మీ శ్లోకమున చెప్పబడినది. అట్టి అనన్య జ్ఞానానంద స్వరూపుడైన సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున జ్ఞేయము కూడ బ్రహ్మమే అని చెప్పబడు చున్నది.

శ్లో॥ యద్య ద్వేద్యం వస్తు స తత్త్వం విషయాఖ్యం
తత్తద్బ్రహ్మైవేతి విదిత్వా తదహం చ।
ధ్యాయం త్యేవం యం సనకాద్యా మునయోఽజం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 9

ప్రతిపదార్థము:- యత్=ఏది, .యత్=ఏది, వేద్యమ్=తెలియదగిన, వస్తు=వస్తువో, సః=అది, విషయాఖ్యమ్=విషయమనుపేరుగల, తత్త్వమ్= తత్త్వము, తత్=దానిని, బ్రహ్మఏవ=బ్రహ్మమే యౌనని, విదిత్వా=తెలిసికొని, తత్=ఆబ్రహ్మము, అహంచ=నేనును, ఏవమ్=ఈ ప్రకారముగా, యమ్= ఎవనిని, సనకాద్యాః=సనకుడు మొదలగు, మునయః=మునులు, ధ్యాయన్తి=

చిత్తమందు చింతించుచున్నారో, అజమ్=పుట్టుకలేని, తమ్=అ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- వేద్య వస్తువునకు విషయమను పేరు కలదు. అది బ్రహ్మమే. తెలిసికొనునట్టి నేనును బ్రహ్మమునే అని సనకాదులు ఎవనిని తెలిసికొందురో, ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- చతుర్వింశతి తత్త్వములు లేక షట్త్రింశత్తత్త్వములు వేద్య తత్త్వములు. వీనిని తెలిసికొనునది ఆత్మ పదార్థము. ఇది యొక్కటి యథార్థముగా తత్త్వమని చెప్పదగినది. తదితరములను తత్త్వములనుట వ్యవహారసిద్ధమే. అయినను పరమార్థము కాకపోవుటవలన వానిని తత్త్వము లనుట ఉపచారము మాత్రమే. చైతన్యమను యథార్థతత్త్వము అధిష్ఠానముగా గలవి కావున వానిని కూడ తత్త్వము లనవచ్చును. అంతమాత్రము చేత వానికి యథార్థతలేదు. అవి మిథ్యలే. మిథ్యావస్తువు అధిష్ఠానమున కన్న అన్యము కాకపోవుటచే 'సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ' అను ఉపనిషద్వాక్యము యొక్క అర్థము నీ శ్లోకమున చెప్పినట్లైనది. సర్వము అనగా విషయము దాని నెఱుగు చైతన్యము అనగా నాచే చూడబడు జగము నేను రెండును బ్రహ్మములే. చైతన్యమునకు విషయమున్నప్పుడు విషయమును గ్రహించుటచే (ఉపచారమున) దాని జ్ఞాతృత చెప్పబడినది. విషయము లేనప్పుడు జ్ఞాతకాకున్నను జ్ఞాతగా ఉపచరింపబడును. నిర్విషయ జ్ఞానముగా సార్వ కాలికముగా నుండునది చైతన్యమే అనగా హరియే. చైతన్యమనగా ఆత్మయే. అనగా నేనే వేద్య విషయము అని ఏ హరిని సనకాదిమునులు ధ్యానించెదరో ఆ సంసారాన్ధకార నాశకుడగు హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున జ్ఞేయము మిథ్యగావున దానిని విడచివేసి నిర్విషయజ్ఞానానంద హరి నాత్మగా తెలియుట (జ్ఞానము)చెప్పబడుచున్నది.

శ్లో॥ యద్య ద్వేద్యం తత్త దహం నేతి విహాయ
స్వాత్మజ్యోతిర్ జ్ఞానమయానంద మవాప్య।
తస్మి న్నస్మీత్యాత్మవిదో యం విదు రీశం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 10

ప్రతిపదార్థము:- యత్=ఏది, యత్=ఏది, వేద్యమ్=తెలియదగినదో, తత్తత్=అదియది, అహమ్=నేను, న=కాదు, ఇతి=అని, విహాయ=విడచి, జ్ఞానమయ ఆనన్దమ్=జ్ఞాన స్వరూపమైన ఆనందమును, స్వాత్మజ్యోతిః= ఆత్మప్రకాశమును, అవాప్య=పొంది, తస్మిన్=దానియందు, అస్మిఇతి=ఉన్నాను అని, ఆత్మవిదః= ఆత్మను తెలియువారు, యమ్=ఏ, ఈశమ్=ఈశ్వరుని, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాన్తవినాశమ్= సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఏదేది వేద్యమో అది వేత్తనైన నేనుకానని (మరియు మిథ్య) అని తెలిసికొని వేద్యమును విడచి వేత్తయగుస్వాత్మ ప్రకాశము జ్ఞానానందముగా పొంది దాని యందు హరినై యున్నానని యే ఈశు నెఱుగుదురో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- తెలియుబడునదంతయు తెలిసినవాని అధీనము అనగా తెలిసికొనుట తెలిసికొనక పోవుట తెలియువాని అధీనమైన విషయము కావున తెలియబడునది తెలిసిన వానిదే అగుచున్నది. ఈ తెలియువాడు సమస్త విశ్వమున నొకడే యున్నాడు. వానిచే తెలియదగిన మనసుల యొక్క ఇంద్రియముల యొక్క భేదము ననుసరించి వానిలో వ్యాపించిన ఆ యొక్క జ్ఞాతయే పెక్కు జ్ఞాతలుగా లోకమున భావింపబడుచున్నది. ప్రతి మనసున నొక జ్ఞాత ఉన్నాడని భావించుట మనభ్రాంతియే. అన్ని మనసులలోనున్న వాడొక జ్ఞాతయే. వాడు హరియే. వాడొక్కడే సత్యము. కావున వానిని తనలోని జ్ఞాతగా నెఱిగి వేద్యములన్ని మిథ్యలు గావున విడువవలెను. బ్రహ్మసత్యం జగన్మిథ్యా అను సిద్ధాంత వాక్యము ప్రథమ పాదమున వివరింపబడినది. ప్రతిజ్ఞాత తనను దుఃఖిగా, సుఖిగా చచ్చువానిగా భావించు చున్నాడు. శాస్త్రము మాత్రము జ్ఞాత జ్ఞానానందమయుడని చెప్పుచున్నది. సర్వములైన మానసేంద్రియ పిండాండ బ్రహ్మాండ రూపక్షేత్రములందొక్కడే జ్ఞాత. వాడే హరి. నా మానసేంద్రియాది క్షేత్రమును జ్ఞాతగా ఆ హరియే యున్నాడు. అని యాతని ఆ జ్ఞానానన్దమయాత్మ జ్యోతి యందు ఉన్నాను అను రూపమున ఎవనిని తెలిసికొందురో ఆతడు హరి. వేద్యము నందు బ్రహ్మదృష్టి పై శ్లోకమున చెప్పబడినది. వేద్యము వేత్తయను యొక్క

విషయము. దేహము వేత్త (తన) కు లోబడిన దానిని విడచి తనను జ్ఞానానంద హరిగా నెఱుగుట అనగ స్వాత్మహర్యైక్య దృష్టి ఈ శ్లోకమున చెప్పబడినది. జీవుడు జగము బ్రహ్మ అను మూడంశము లే దర్శనమునవైనను విచార్యములు. వీనిలో జీవ బ్రహ్మల ఐక్యము వేద (వేదాంత) ప్రతిపాదిత సిద్ధాంతము. ఇక మిగిలిన జగము మిథ్యయై హేయ మైనది. కావున మూడింట బ్రహ్మ మొక్కటే మిగిలినది. జీవుడనగ మనస్సు ఇంద్రియములు పిండము వీని యొక్క సంఘాతము (చైతన్యముతో సహ). మనస్సు ఇంద్రియములు పిండము వేద్యములు అని జీవుని నుండి వేరు చేయగా విడచి వేయగా అనగా మనసు నేను కాదు ఇంద్రియములు నేను కాదు, ఈ విధముగా త్రోసివేయగా అవి ఉనికిని కోల్పోయి చైతన్యము మిగులును. అది అన్ని జీవులందున్నది, బ్రహ్మముగా అనేక రూపముగా జ్ఞానానందమయముగా నున్నది. అదే నేను అను అనుభవము కలిగినవాడు హరియై పోవును. (అనుభవము కలుగ నంత వఱకు అది వట్టి (పరోక్ష) జ్ఞానము మాత్రమే) ఇది జీవ విచార ఫలము. అట్లే జగమును విచారింపగా దానిలో కనబడు రూపనామములు మిథ్యలు. వానిని తోసివేయగా అధిష్ఠాన చైతన్యము మిగులును. అది సర్వవ్యాప్త హరి స్వరూపము. ఈ జ్ఞాన మనుభవములోకి వచ్చినవాడు హరియై పోవును. బ్రహ్మను విచారించగా రజస్సత్వతమోగుణములతో ఆయన చేయు సృష్టి స్థితి లయములు మాయా కృత్యములు కాని ఆయన కృత్యములు కావని త్రోసివేయగా గుణములు కూడ మాయయే అని త్రోసివేయగా, మాయయు మిథ్యయని మాయను త్రోసివేయగా చైతన్యమనే స్వానుభవము మిగులును. ఇది బ్రహ్మ విచారఫలము. ఈ విచారములలో జీవ విచారము బ్రహ్మ విచారము రెండును తత్త్వమ్ పదార్థముల శోధన అనఁబడును. దీనిని చేయగా జీవధర్మములుగానున్న మానసేంద్రియపిండములు బ్రహ్మధర్మములు గానున్న మాయామయ బ్రహ్మాండాదులు తోసివేయదగినవని తత్త్వమసి యను వాక్యము బోధించుచున్నది. ఆ ధర్మములు తోసివేయనిదే తత్త్వమసి వాక్యము యొక్కఅర్థము ఉపపన్నముకాదు. నక్కయెక్కడ, నాగలోక మెక్కడ, జీవుడెక్కడ, బ్రహ్మ మెక్కడ. జీవుడత్యల్పుడు. బ్రహ్మము మహామహిమాన్విత మైనది. అత్యల్పత్వమును ఆ మహిమను లక్షణావృత్తి నాశ్రయించి తోసివేయగా అల్పత్వమహిమలు నివృత్తములుకాగా అఖండ వాక్యార్థ జీవ బ్రహ్మైక్యము:

(ఏక చైతన్యము) సిద్ధమగును. ఆ జీవ బ్రహ్మైక్యమే హరి. ఆ సంసార నాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి ప్రకాశదృశి స్వరూపుడని చెప్పబడు చున్నది.

శ్లో॥ హిత్వా హిత్వా దృశ్య మశేషం సవికల్పం
మత్వా శిష్టం భాదృశిమాత్రం గగనాభమ్।
త్యక్త్వా దేహం యం ప్రవిశం త్యచ్యుత భక్తా
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే। 11

ప్రతిపదార్థము:- సవికల్పమ్=వికల్పములుగల, అశేషమ్=సమస్తమైన, దృశ్యమ్=దృశ్యమును, హిత్వా=వదలి, హిత్వా=వదలి, శిష్టమ్=మిగిలిన, భాదృశి మాత్రమ్=దృశిమాత్రమైన, గగనాభమ్= ఆకాశము వంటి వానినిగా, మత్వా= తలచి, దేహమ్=దేహమును, త్యక్త్వా=విడచి, అచ్యుత భక్తాః=విష్ణు భక్తులు, యమ్=ఎవనిని, ప్రవిశంతి=ప్రవేశించెదరో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:- సవికల్పమైన సమస్త దృశ్యమును క్రమముగా వదలి మిగిలిన దృశిమాత్రుని ఆకాశము వంటి వానినిగా దలచి దేహమును విడచి అచ్యుత భక్తులెవనిని ప్రవేశించెదరో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఉపనిషత్తులలో (నిర్గుణ బ్రహ్మ విలక్షణ) సగుణబ్రహ్మ లక్షణము చెప్పబడినది. సగుణ బ్రహ్మోపాసన వలన పునరావృత్తి రహిత బ్రహ్మలోక ప్రాప్తి ఫలము, నిర్గుణ బ్రహ్మ జ్ఞానము వలన కైవల్యఫలమును చెప్పబడినది. వాస్తవమున సగుణబ్రహ్మ నిర్గుణ బ్రహ్మ అని రెండు బ్రహ్మలు లేవు. జగత్సృష్ట్యాదు లెట్లు కలిగినవి? అని జగత్సత్యత్వము నంగీకరించువారు ప్రశ్నించెదరని శ్రుతి జగజ్జన్మస్థితిభంగత్రయము బ్రహ్మ లక్షణముగా చెప్పినవి. (ఇదియే సగుణ బ్రహ్మ లక్షణము) ఈ లక్షణము తటస్థ లక్షణము అని చెప్పబడును. ఆగంతకుడు తనకు కొత్తయైన యూరిలో ఊరివారిలో నొకనిని సుబ్బారావు గారిల్లెక్కడ అని ప్రశ్నించెను. ఆ ఊరి వ్యక్తి చూడండి, అక్కడ

కాకి వాలియున్న యిల్లే సుబ్బారావు గారిదని చెప్పెను. ఆగంతునకు ఆ ఇంటి జ్ఞానము కలిగి తన పనిని ముగించుకొని వచ్చిన దారిన పోయెను. కాకి సుబ్బారావు గారింటికి లక్షణమగునా? ఆ క్షణమున మాత్రము ఆగంతుకు నకు సుబ్బారావిల్లేదో తెలిసికొనుట కుపయోగించిన మాట వాస్తము. కాకి ఆ క్షణమున మాత్రముండి తరువాత ఎగిరిపోవును. ఇంకొకరికా సుబ్బారావు గారిల్లేదో తెలుపవలసి వచ్చినప్పుడు అదిగో ఆ యెత్తుమేడ సుబ్బారావు గారిల్లు అని చెప్పిన ఆగంతునకు అర్థమగును. ఆ ఎత్తుగా నుండుట ఆ ఇంటి స్వరూప లక్షణమగుట నిర్వివాదాంశము. అట్లే జగముల సత్సత్వము వ్యవహార సిద్ధముగా నుండుట గమనించి ఈ జగముల నెవడు సృష్టించెను, పాలించు చున్న దెవరు? వానిని సంహరించు వాడెవడు? అను ప్రశ్న కలిగిన వారి నుద్దేశించి బ్రహ్మ యున్నది. దానికి జగత్తును పుట్టించుట, రక్షించుట, నశింపజేయుట లక్షణములని చెప్పెను. ఆ బ్రహ్మ నుపాసించినవాడు బ్రహ్మలోకమునొంది తనలోకముతో సహా తన వ్యాపారము నుపసంహరించు కొనబోవునప్పుడు స్వలోక వాసులకు తన స్వరూపము సత్యజ్ఞానానంద మయమని చెప్పి మీరును నేనును సత్యజ్ఞానానంద మయులమే. మనకు భేదము లేదను తత్త్వమసి వాక్యార్థము నుపదేశించును. ఆ లోకవాసులు ప్రత్యగ్బ్రహ్మైక్యజ్ఞానమునొంది లోకావసానమున కైవల్యము నొందెదరు. సత్యజ్ఞానానంద మయత్వలక్షణము స్వరూపలక్షణ మనబడును. ఇదియే యథార్థముగా బ్రహ్మ లక్షణము. వెనుకబడిన జగజ్జన్మాది లక్షణము లక్షణమేకాదు ఉపలక్షణము మాత్రమే. అయినను ఆ ప్రశ్నించువాని ప్రయోజనము నెఱవేర్చినదగుటచే దానిని లక్షణముగా భావించుట తప్పుకాదు. సత్యజ్ఞానానందాదులు మాత్రము గుణములుకావా? అయినచో ఇది నిర్గుణ మైన బ్రహ్మకు లక్షణ మెట్లగును అను ప్రశ్నము కలుగును. ఇవి అసత్య జ్ఞానానందముల నివర్తించునవి మాత్రమే యగుటచే నిది 'దృశి' మాత్ర బ్రహ్మ స్వరూప బ్రహ్మకు లక్షణముగా నంగీకరింపబడినది. నేనెవడను? అను ప్రశ్నము వేసికొన్నవాడు కరపాదాద్యవయవములు కల స్థూల దేహము నేను అనుకొని నేను లావుగా నున్నాను అనుకొనును లేక సన్నగానున్నాను అనుకొనును. లావు సన్నము లనునవి తనకు దృశ్యములే కావున ఇవి నావి కావచ్చునేమో గాని (అదియు సందిగ్ధమే), నేను మాత్రము కాదు అని స్థూల దేహమును

త్రోసివేయవలెను. పిమ్మట నేను చూచుచున్నాను, వినుచున్నాను, ఇత్యాద్యనుభవముల ననుసరించి సూక్ష్మములైన ఇంద్రియసమూహము నేను అనుకొనును. తనకు ఇంద్రియములున్నవని తెలియుచున్నవిగదా! అందుచేత ఇంద్రియసమూహము తనకు దృశ్యమే (వేద్యమే) అగుచున్నది. నేను కంటితో చూచుచున్నాను, చెవితో వినుచున్నాను ఇత్యాద్యనుభవముల వలన ఇంద్రియముల జ్ఞాన సాధనత్వము తెలియుటవలన అవి జ్ఞేయముల (వేద్యముల)నుట స్పష్టమగును. అట్లే తన ఆకలిదప్పుల వలన తన ప్రాణములు (వాని శక్తియు) వేద్యము లగుచున్నవి. సుఖదుఃఖానుభవముల వలన వానికి మూలమైన మనస్సుకూడ వేద్యమే అగుచున్నవి. వీనన్నిటి యందు జ్ఞాతృత్వాభాసము కూడ నున్నది. మరియు నిద్రలో తనకేమి తెలియదను అనుభవము చేత అజ్ఞానము కూడ వేద్యమగుచున్నది. ప్రాణేంద్రియమనస్సులు సూక్ష్మశరీరమని, అజ్ఞానము కారణ శరీరము అని చెప్పబడును. ఈ వివరణమును బట్టి స్థూల సూక్ష్మ కారణశరీరత్రయము వేద్యమే. వాని కతీతమైన చైతన్యమే అజ్ఞాత అని తెలియుచున్నది. వాస్తవమునకు జ్ఞాతృత్వము (దర్శకత్వము) కూడ ఉపచారమే అని వెనుక చెప్పబడినది.అదియే బ్రహ్మ హరి అని పేర్కొనబడును. హరియందు భక్తి గలవారు దేహావసానమున ఏ హరియందు కైవల్యము నందెదరో సంసారాన్ధకార నాశకుడైన ఆ హరిని సుత్తించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి దృశ్యములైన (వ్యష్టి సమష్టి) శరీరములన్నియు హరియే అని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వత్రాస్తే సర్వ శరీరీ స చ సర్వః
సర్వం వేత్త్యే వేహ న యం వేత్తి చ సర్వః।
సర్వత్రాంతర్యామిత యేత్థం యమయ న్య
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే ॥ 12

ప్రతిపదార్థము:- యః=ఎవడు, సర్వత్ర=అన్నిచోట్ల, ఆస్తే=ఉన్నాడో, సర్వశరీరీ=సర్వము (సర్వదృశ్యము) శరీరముగా గలిగియున్నాడో, సః=ఆతడు, సర్వఃచ=సర్వమును (అయియున్నాడు), చ=మరియు, ఇహ= ఇచట, సర్వమ్= సర్వమును, వేత్తిఏవ=తెలిసికొనుచునేయున్నాడు, సర్వః=సర్వము, యమ్=

ఎవనిని, నవేత్తి=తెలిసికొనదో, ఇత్థమ్= ఈ విధముగా, సర్వత్ర=అంతట, అంతర్యామితయా =లోపల నుండి నియమించుటచేత, సర్వమ్=సమస్తమును, యమయన్=నియమించుచు (ఉన్నాడో), తమ్= ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

**తాత్పర్యము:-** ఎవడు అంతట ఉన్నాడో, సమష్టి వ్యష్టి దృశ్యము నంతయు శరీరముగా గలిగియున్నాడో, సర్వమును అయిఉన్నాడో, సమస్తమును తెలిసికొనుచునే యున్నాడో, సమస్త మెవనిని తెలిసికొనలేదో తెలిసికొనజాలదో ఈ విధముగా ఎవడు అంతట నుండి సమస్తమును తత్తత్ కృత్యములందు సుఖదుఃఖాది గోచరములందు నియమించుచు ఉన్నాడో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

**వివరణము:-** హరి ఈ జగమున లేక ఈ జగములలో లేక ఈ అనంత కోటి బ్రహ్మాండములలో అంతట ఉన్నాడు. ఆయన లేని ప్రదేశము ఎచ్చటను లేదు. ఇంతేకాక ఆయన తప్ప మఱేదియు లేదు. ఉన్నది ఆయనయే. అసలు ఉనికియే ఆయన, ఆయన ఉనికి లేని వస్తువులు ఉన్నట్లు తోపింపజేయును. ఏదైన అసత్య వస్తువున్నట్లు కనిపించిన దనగా ఆయన ఉనికియే వానియందు మనచే చూడబడుచున్నదన్నమాట. ప్రతి వస్తువు ఉన్నదనగా ఎచట ఉన్నది. అను ప్రశ్నము కలుగును. ఆ ప్రశ్నకు సమాధానము దేశము అని చెప్పబడును. అట్లే ఒక వస్తువు ఉన్నదనగా ఎప్పుడు అను ప్రశ్నము కలుగును. ఆ వస్తువు ఉనికి భూతకాలికమా, వర్తమాన కాలికమా, భవిష్యకాలికమా! ఎప్పుడు అని ప్రశ్నించుటలోని అర్థమది. ఈ దేశకాలములలో అనగా అన్ని దేశములలో అన్నికాలములలో హరి ఉన్నాడు. స్వప్నములో దేశకాలములున్నవి కాని అవి జాగ్రద్దశకు సంబంధించిన దేశ కాలములు కావు. స్వప్నకాలమున మనస్సే దేశకాలవస్తు స్వరూపమును ధరించి మనకు తోచును. జాగ్రద్దశలో దేశకాల వస్తువులు వ్యవహారగోచరములైయున్నవి. కొందఱి శాస్త్రజ్ఞుల వ్యవహారమున దేశకాలమలు నిత్యములు, విభువులు. సర్వదేశ కాలములలో ఉండు వస్తువు, విభువు అని చెప్పబడును. ఆకాశము దిక్కును విభువుగా వారు పేర్కొందురు. సూర్యు ననుసరించియే పూర్వాది దిగ్వ్యవహారము కాలవ్యవహారమును ఏర్పడినవి అనుట ఆధునికుల

వ్యవహారమున సిద్ధము. ఆత్మ సర్వదేశములలో ఉన్నదని చెప్పుటకు దేశము లుండవలె. అన్ని కాలములలో ఉన్నదని చెప్పుటకు కాలములు ఉండవలెను. కాని ఆత్మయే ఉనికి యైనప్పుడు అది దేశకాలముల వ్యాపకము. దానికి దేశకాలములు వ్యాప్యములు అని చెప్పవలసియున్నది. కావున అన్ని దేశములందును అన్ని కాలములందును ఆత్మయున్నదని దేశకాలములను వ్యాపకముల జేసి చెప్పుట వ్యవహారము మాత్రమే. ఈ వ్యవహారము ననుసరించి ఈ శ్లోకము యొక్క ఆరంభమునందు ఆత్మ అన్నిచోట్ల ఉన్నదని దానియొక్క సార్వదేశికత్వము చెప్పబడినది. ఈ మాట సర్వకాలములందును ఉన్నదను వ్యవహారము ననుసరించిన సార్వకాలికత్వమును చెప్పబడినట్లే అని యెఱుగవలెను. దేశము కాలము కాదు, కాలము దేశముకాదు. అను వ్యవహారము ననుసరించి దేశము పరిచ్ఛిన్నమే, కాలమును పరిచ్ఛిన్నమే అని తెలియుచున్నది. అట్లే గుఱ్ఱము గాడిదకాదు. గాడిద గుఱ్ఱముకాదు. గుఱ్ఱము గుఱ్ఱమే, గాడిద గాడిదయే, అను వ్యవహారమునందు గుఱ్ఱము గాడిద పరిచ్ఛిన్న వస్తువులుగా గుర్తింపబడుచున్నవి. ఆత్మ ఆ విధముగా ఇదికాదు అని చెప్పరానిది కావున సర్వమును అదియే అయి యున్నది. కావున ఇదికాదు అని చెప్పరాదు కావున వస్తు పరిచ్ఛేదములేనిది. అట్లే ఒక దేశమున ఉన్నదని ఒక దేశమున లేదని చెప్పరానిది. కావున దేశ పరిచ్ఛేదము ఆత్మకులేదు. అట్లే ఒక కాలమున ఉన్నదని ఒక కాలమున లేదని చెప్పరానిది కావున కాలపరిచ్ఛేదము ఆత్మకు లేదు. ఈ శ్లోక ప్రథమ పాదమున సర్వత్ర ఆస్తే అనుటచే దశ పరిచ్ఛేదము లేదని సర్వ శరీరీ అనుటచే వస్తు పరిచ్ఛేదము లేదని సచసర్వః అనుటచే దేశకాలవస్తు పరిచ్ఛేదము లేదని చెప్పబడినది. 'సర్వమ్ వేత్త్యేవ (అంతను తెలుసుకొనుచునే ఉన్నది) అని ద్వితీయ పాదమున ఆత్మయొక్క జ్ఞాతృత చెప్పబడినది. వేత్తి+ఏవ అని అవధారణమును ప్రయోగించుటచే జ్ఞాతృత్వము దాని (ఆత్మ) స్వరూపము అని తెలియుచున్నది. 'యమ్ నవేత్తి సర్వః' (దేనిని సర్వము తెలిసికొనదో) అనుటచే ఆత్మను తెలిసికొనున దేదియు లేదని తెలియుచున్నది. ద్వితీయ పాదమున సర్వము జ్ఞేయమని ఆత్మ రూప హరి సర్వజ్ఞాత (జ్ఞాత) అని చెప్పబడినట్లు గమనింపవలెను.మూడవ పాదమున 'సర్వత్ర అంతర్యామితయా యమయన్ యః' అన్ని శరీరములలో అన్ని వస్తువులలో నుండి వానిని నియమించు

చున్నదని చెప్పబడినది. కావున సర్వత్ర శబ్దము 'సర్వశరీరము లలో వస్తువులలో' అను అర్థమును బోధించును. మొదటి పాదములోని సర్వత్ర శబ్దమును సర్వదేశమును, మూడవ పాదమునందలి సర్వత్ర శబ్దము 'సర్వ వస్తువు(ల)ను' బోధించును. అంతర్యామి యనగా లోపల నుండి నియమించు వాడు. కావున మూడవ పాదము సర్వజగజ్జీవ నియామకత్వమును సర్వ జగజ్జీవుల హరి నియామకత్వమును తెలుపుచున్నది. నియామకుని ఇచ్ఛ, ఆజ్ఞ ననుసరించి సర్వ నియామ్య ప్రవర్తన యుండును. భీషాస్మాద్వాతః పవతే భీషాదేతిసూర్యః భీషాస్మాదగ్నిశ్చేంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః - గాలి, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు మొదలగు దేవతలందఱును తమతమ పనులలో ఆ హరి యాజ్ఞచేతనే ప్రవర్తిల్లు చుందురు. మృత్యువాతనికి భయపడి పరుగెత్తును. అను శ్రుతి యొక్క అర్థమును మూడవ పాదము బోధించును. ఏ హరి దేశకాల వస్తు పరిచ్ఛేద శూన్యుడో సర్వము నెఱుగువాడై సర్వముచే తెలియబడక యుండునో సర్వజగజ్జీవ నియామకుడై ఉన్నాడో ఆ సంసారాన్ధ కార నాశకుడైన హరిని స్తుతించెద ననుట శ్లోకార్థ సంగ్రహము.

అవతారిక:- ఈ శ్లోకమున జ్ఞాను లాత్మరూపహరి నెట్లు దర్శింతురో (చూతురో) చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వం దృష్ట్వా స్వా22త్మని యుక్త్యా జగ దేత
ద్దృష్ట్వా22త్మానం చైవ మజం సర్వ జనేషు।
సర్వా22త్మైకో2స్మీతి విదు ర్యం జనహృత్స్థం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 13

ప్రతిపదార్థము:- స్వాత్మని=స్వాత్మయందు (తనయందు), యుక్త్యా= శ్రుతియుక్తులచేత, సర్వమ్= ఆకాశము మొదలైన, ఏతత్=ఈ, జగత్= జగమును, దృష్ట్వా=చూచి, ఏవమ్=ఇట్లు, అజమ్=పుట్టుకలేని, ఆత్మానమ్= తనను, సర్వజనేషు= సర్వజనులందును, దృష్ట్వాచ=చూచియు, సర్వాత్మా= సర్వాత్ముడనై, ఏకః=ఒకడునునై, అస్మి=ఉన్నాను, ఇతి=అని, జనహృత్స్థమ్= జనుల హృదయములందున్న, యమ్=ఎవనిని, విదుః= తెలియుదురో, తమ్= ఆ, సంసారధ్వాన్తవినాశమ్= సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- తనయందు ఈ జగమునంతను పుట్టువులేని తనను సర్వజనులందును చూచి సర్వాత్ముడనైన నేనొకడనే అని సర్వజన హృదయ గతుడైన ఏ హరిని స్వాత్మగా జ్ఞానులెఱుగుదురో సంసారాన్ధకార నాశకుడైన ఆ హరిని స్తుతించెదను.

వివరణము:- ఈ జగము పాంచ భౌతికము. అనగా పంచభూత యుక్తము. పంచభూతములు జడములు. వాని నుండి పుట్టిన ఈ జగమును జడమే. ఈ జగమెచట నున్నది? తనకు బయటనున్నట్లు కనబడుచున్నది. రక్తమాంసాస్థి ధాత్వాదులు తన శరీరములో నున్నవి. కాని వానిని తన లోపలనున్నట్లు అజ్ఞాని చూచుచున్నాడు. ఇంద్రియగోళములు శరీరములో నున్నవి. వానిని తనలోని వానినిగానే అజ్ఞాని చూచుచున్నాడు. లోన బయట యన్ని చెప్పుటకు శరీరమేహేతువు. తన శరీరము నుపాధిగా చేసికొని లోనన్నుది, బయటనున్నవి అని జడములైన జగత్పదార్థములను రెండుగా విభజించుకొని అజ్ఞాని చూచుచున్నాడు. స్వప్నములో నీ స్థూల శరీరోపాధి లేకున్నను తన స్థూలదేహమును పరుల స్థూలదేహమును కల్పించుకొని వ్యవహరించు చున్నాడు జాగ్రదవస్థలోనికి వచ్చిన పిదప స్వప్నములో నేను చూచిన స్వస్థూల దేహ, పరస్థూల దేహములను నేను నాలో కల్పించుకొనినవే అని గ్రహించుచున్నాడు. స్వప్నములో చూచినవన్ని యుచట నుండి వచ్చినవి? నేను గదిలో నిద్రించుటకు పూనుకొని యుంటిని. ఆ గదిలోని కాదృశ్యములన్ని ఎట్లు వచ్చినవి. నాకు నిద్ర పట్టినది. నిద్రలోనే కల వచ్చినది. ఆ కలలో వీని నన్నింటిని చూచితిని. అవి యన్నియు నాలోనే నేను చూచితిని. నేనే వానిని కల్పించుకొంటిని. లేక నా లోని యాత్మ కల్పించుకొనెను. అని జాగ్రదవస్థ లోనికి వచ్చిన పిదప తలపోసికొనును. తన యాత్మ శక్తికి తానే యాశ్చర్యము నొందును లేక పరిశీలించుకొని స్వప్న నిర్మాణశక్తి నాదా! నా లోనున్న ఏదేని దేవతదా! అనియు సందేహించును. స్వప్నమున తనను ఇతరులను, ఇతరమును చూచుట, జాగ్రదవస్థలో తనను ఇతరమును చూచుట ఏకరూపములుగానే ఉన్నవి. తన ఇంద్రియశక్తులు పనిచేయుచున్నవి అని జాగ్రదవస్థలో అనుమానించుకొనును. నిద్రపోవుట యనగా తన ఇంద్రియ శక్తులు పనిచేయక పోవుటయని తెలిసిన జీవుడు స్వప్నములో నేదో యొక్క శక్తి పనిచేసినది అని తెలిసికొనును. జాగ్రదవస్థలో కన్నులు మొదలగు

ఇంద్రియములు పనిచేయక పోయినను తన మనస్సు పనిచేసి ఎన్నో దృశ్యములను చూచుట నెఱిగిన జీవుడు స్వప్నమున ఆ మనస్సుయే పనిచేసినదని గ్రహించుటకు సందేహించనక్కఱ లేదు. అంతర్బాహ్య విభాగ మనునదేదియు లేదని చూపబడుట,చూచుట అను రెండే స్థితులున్నవి, అని పై వివరణమును బట్టి గ్రహించనగు. అంతర్బాహ్య విభాగము తన మనస్సు యొక్క కల్పనమే అనియు గ్రహించనగును. నిద్రలో చూడబడున దేదియు లేకపోవుట వలన తన అజ్ఞానము అచట దృశ్యముగా నున్నది, అని తెల్లవారి మేలుకొనిన పిమ్మట నిద్రలో నాకేమియు తెలియలేదు, అను స్మృతి వలన ఆ అజ్ఞానము అప్పుడు తనకుండెనని తెలిసికొన వచ్చును. జాగ్రత్స్వప్నావస్థ లలో విషయానుభవమున్నది. నిద్రావస్థలో అజ్ఞానమే విషయముగా ఉన్నది. కావున జ్ఞానము, ఆత్మ-నిద్రలో అజ్ఞానమును, స్వప్నజాగ్రద్దశలలో విషయములను చూచినది. అనగా వానికి సాక్షి తానేయని, అది అన్ని జాగ్రత్స్వప్న సుషుప్తులలోను ఉన్నదని తెలిసికొనును. ఇది తనవలె ఇతర జీవులకును సమానముగా నున్నది. తనలోని సాక్షికి ఇతరులలోని సాక్షికి ఎంత ఆలోచించినను భేదమేమియు చెప్పజాలము. కావున శాస్త్రమున చెప్పబడినట్లు సాక్షియైన ఆత్మ (జ్ఞానము) సర్వజీవులలో సమానముగా నున్నదని ఒప్పు కొనవలసియున్నది. బాహ్యాంత ర్జగత్తంతయు తనలోనే చూచి (గ్రహించి) తననే (సాక్షినే) జనులందరులోనను గ్రహించి (చూచి) నప్పుడు సాక్షి పుట్టుకలేని దనియు, పుట్టుక చావులు తనచే గ్రహింపఁబడిన దేహేంద్రియాదులకే కలవని గ్రహించును. అవియును తనలోనివే కావున తనకన్న భిన్నమైన దేమియు లేదని సర్వాత్ముడనైన నేను (హరిని) ఒకడనే అని ఏ హరిని జ్ఞానులు తెలిసికొందురో ఆ సంసారాన్ధకార వినాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ఇంద్రియ కృత్యములైన శ్రవణాదులు సాక్షి(కృత్యములు)వి కావని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వత్రైకః పశ్యతి జిఘ్ర త్యథ భుఙ్క్తే
స్ప్రష్టా శ్రోతా బుధ్యతి చే త్యాహు రిమం యమ్ః
సాక్షీ చాస్తే కర్తృషు పశ్య న్నితి చాన్యే
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 14

ప్రతిపదార్థము:- సర్వత్ర=అన్నిచోట్ల, ఏకః=ఒకడు, పశ్యతి=చూచును, జిఘ్రతి=వాసనచూచును, అథ=పిమ్మట, భుఙ్క్తే=భుజించును, స్ప్రష్టా= స్పృశించువాడు, శ్రోతా=వినువాడునగును, చ=మరియు, బుధ్యతి= గ్రహించును, అనియమ్= ఎవనిని గురించి, ఆహుః=చెప్పెదరో, కర్తృషు= కర్తలందు, పశ్యన్=చూచుచు, సాక్షీచ=సాక్షియునై యున్నాడు, ఇతి= అని, అన్యే=ఇతరులు, ఆహు=చెప్పెదరో, తమ్ = ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- అన్ని చోట్ల ఒకడే చూచుచున్నాడు. వాసన చూచుచున్నాడు. పిమ్మట భుజించు చున్నాడని, స్పృశించువాడు, వినువాడు నాతడని కర్తలందు చూచు సాక్షియని యెవనిని గూర్చి చెప్పెదరో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- మనకు చూచు కన్ను, వాసన చూచు ముక్కు, స్పృశించు త్వక్కు, విను చెవి, రుచి చూచు నాలుక ఉన్నవి. ఇవి జ్ఞానేంద్రియములు. వీని సాయమున ఆత్మయే ద్రష్ట ఘ్రాత, స్ప్రష్ట, శ్రోత, భోక్త అగుచున్నాడని, ఆత్మను కర్తగా, భోక్తగా సాధారణులందరు భావించెదరు. అట్లే (మనో) బుద్ధీంద్రియ సాయమున మంచి చెడ్డ విషయములు గ్రహించు చున్నాడని భావించెదరు. ద్రష్ట శ్రోత, స్ప్రష్ట, మొదలగు వారందరు దర్శన, శ్రవణ, స్పర్శనాది కర్మలకు కర్తలు. ఈ కర్తలలోని కర్తృత్వమును (కర్తలను) గ్రహించువాడు సాక్షియేకాని, కర్తకాడని జ్ఞానులే హరిని గురించి చెప్పుచున్నారో, ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరియే కర్తయైన విషయజ్ఞుడైన జీవుని ఈశుడని మరియు స్వాత్మయని చెప్పబడుచున్నది.

శ్లో॥ పశ్యన్ శృణ్వ న్నత్ర విజానన్ రసయన్ సం
జిఘ్రన్ బిభ్ర ద్దేహ మిమం జీవతయేత్థమ్।
ఇత్యాత్మానం యం విదు రీశం విషయజ్ఞం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 15

ప్రతి పదార్థము:- పశ్యన్=చూచుచు, శృణ్వన్=శ్రోత్రములచేత వినుచు, అత్ర=ఇచట, విజానన్=బాగుగా తెలిసికొనుచు, రసయన్=తినుచు, సంజిఘ్రన్ = వాసన చూచుచు, ఇమమ్=ఈ, దేహమ్=దేహమును, బిభ్రత్= మోయుచు, ఇతి=ఈ ప్రకారముగా, విషయజ్ఞం=విషయముల నెఱుగు, ఆత్మానమ్= ఆత్మను, ఇత్థమ్ = ఇట్లు, జీవతయా=జీవరూపమున, ఈశమ్= ఈశ్వరుడైన, యమ్=ఎవనిని, విదుః=తెలిసికొందురో, తమ్ = ఆ, సంసారధ్వాన్త వినాశమ్ =సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:- చూచుచు, వినుచు, తెలిసికొనుచు, భుజించుచు, వాసన చూచుచు, విషయజ్ఞుడైన దేహమును మోయుచున్న జీవునిగా, ఈశ్వరునిగా, ఆత్మగా, ఎవనిని తెలిసికొందురో ఆ సంసారాన్ధకారవినాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- రూపమును చూచుట, శబ్దము వినుట, రుచులను గ్రహించు(భుజించుట) లేక రసించుట,వాసన చూచుట, స్పృశించుట, అనునవి జీవుని పంచేంద్రియ కృత్యములు. ఈ పంచేంద్రియములను జ్ఞానేంద్రియము లందురు. కన్ను, చెవి, నాలుక, ముక్కు, త్వక్కు అను నీయైదు జ్ఞానమును కలిగించు కరణములు (పనిముట్లు) కావున జ్ఞానేంద్రియము లనబడును. వాస్తవమునకు కన్నులోని చూచు శక్తియే కన్ను, చెవిలోని వినుశక్తియే చెవి. నాలుకలోని రుచిని గ్రహించు శక్తియే నాలుక. ముక్కులోని వాసన చూచు శక్తియే ముక్కు, త్వక్కులోని స్పర్శను గ్రహించు శక్తియే త్వక్కు. ఆ శక్తులే ఇంద్రియములు, కాని కనబడు కన్ను, ముక్కు, చెవి, నాలుక, త్వక్కు ఇంద్రియములు కావు. అవి ఆ ఇంద్రియములుండు ప్రదేశములే. జ్ఞానేంద్రియ ముల సాయమున శబ్ద స్పర్శ రూపాదులు గ్రహింపబడును. ఈ ఇంద్రియ ములు శక్తులు. పనిచేయని స్వప్నమున మనసే ఈ యన్ని యింద్రియముల పని చేయును. నిద్రలో ఆ మనసు కూడ పనిచేయదు. శబ్ద స్పర్శరూపాదుల గ్రహించుట మానస వ్యాపారము కావున ఈ విషయజ్ఞానము క్షణికమని కొందరందురు. ఈ విషయజ్ఞానమున విషయముతో పాటు, విషయియు నుండును. ఈ విషయమెవనికి తెలిసినదో వాడు విషయి యనబడును. విషయముల ఉపస్థితిలేని సమాధి అవస్థలో నిర్విషయ జ్ఞానముండును. దాని

ప్రకారము విషయము పైబడి విషయమునకు విషయత్వము, విషయికి విషయిత్వము సిద్ధము అగును.కావున విషయియైన జీవుని విషయజ్ఞుడందురు. ఈ కనబడు స్థూలదేహమును దానిలోని సూక్ష్మకారణశరీరములను జీవుడు ధరించును. పైన చెప్పబడిన జ్ఞానేంద్రియములు సూక్ష్మశరీరాంతర్గతములు. ఆ జీవుడు యింద్రియములకు ప్రభువు గావున ఈశుడని చెప్పబడును. జగము నందలి సర్వస్థూల సూక్ష్మకారణ శరీరములందుండు ఈశ్వరుడు సర్వేశ్వరుడు హరి. ఆయనయే తన ఆత్మయని యెవరు గ్రహింతురో వారు జ్ఞానులు. జీవుడని ఈశుడని ఆత్మయని ఏ హరిని జ్ఞానులు గ్రహించెదరో ఆ సంసారాన్ధకార నాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:-ఈ శ్లోకమున జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో కలుగు సుఖ దుఃఖాదుల కతీతమైన సమాధ్యవస్థలోని ఆనందము ప్రస్తావింపబడుచున్నది.

శ్లో॥ జాగ్ర ద్దృష్ట్వా స్థూలపదార్థా నథ మాయాం
దృష్ట్వా స్వప్నే2థాపి సుషుప్తౌ సుఖనిద్రామ్।
ఇత్యాత్మానం వీక్ష్య ముదా22స్తే చ తురీయే
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 16

ప్రతిపదార్థము:- స్థూల పదార్థాన్=స్థూలపదార్థములను, జాగ్రత్= జాగ్రదవస్థను, దృష్ట్వా=చూచి, అథ=పిమ్మట, మాయామ్=మాయను, స్వప్నే= స్వప్నమున, దృష్ట్వా=చూచి, అథ=పిమ్మట, సుఖనిద్రామ్=సుఖనిద్రను, సుషుప్తౌ అపి=సుషుప్తి యందును, దృష్ట్వా=అనుభవించి, ఇతి=ఈవిధముగ, తురీయే= నాలుగవ అవస్థ(సమాధి)యందు, ఆత్మానమ్= ఆత్మను, వీక్ష్య=చూచి, ముదా చ=సంతోషముతో, ఆస్తే=ఉన్నాడో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నాశకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- జాగ్రద్దశ యందలి స్థూల పదార్థములను స్వప్నములోని సూక్ష్మ పదార్థములను సుషుప్తి యందలి సుఖనిద్రను సర్వమును మాయా మయముగా గ్రహించి దానిని విడచి నాలుగదైన సమాధ్యవస్థ యందు ఏ హరిని స్వాత్మగా దర్శించి సంతోషించెదరో ఆ సంసారాన్ధకార వినాశకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- జాగ్రద్దశలో మనము గ్రహించు పదార్థములన్నియు స్థూలములు. ఇవి జీవులందరి యనుభవమున నుండును. స్వప్నములోని పదార్థము లట్లుగాక కలగాంచు నొక్కని అనుభవముననే గోచరించును. కావున స్వప్నము మాయయని యనగా లేకుండ కనబడినదని మెలకువ వచ్చిన వాడు గ్రహించును. అనగా ఒక అవస్థలో(స్వప్నావస్థలో)గోచరించిన పదార్థములు జాగ్రద్దశలో గోచరించవు. కావున అవి మాయయని చెప్పబడును. అవి ఏకవ్యక్తి (కలగాంచువాని)కే భాసించును కావున ఆ పదార్థములు ప్రాతిభాసిక ములని చెప్పబడును. బాగుగా పరిశీలించినచో, కలలో గోచరించిన పదార్థములు మెలకువలో గోచరించనందుననే అవి మాయయని చెప్పబడినవి గదా! మరి జాగ్రదవస్థలో గోచరించిన పదార్థములు నిద్రావస్థలోగోచరించవు గదా! వానినేల మాయ యనరాదు? శాస్త్రము జాగ్రదవస్థలోని పదార్థములను గూడ, మాయయనియే చెప్పినది. సంసారులము మనకే మాట తలకెక్కుట లేదు. జాగ్రదవస్థలోని పదార్థములను సత్యములుగా మనము భ్రమించు చున్నాము. జ్ఞానియైనవాడు ఇట్లు భ్రమించడు. మనను చూచి జాలిపడునేమో. జ్ఞానరూపుడైన ఆ హరియు జాలి పడునేమో? లేక ఆ జ్ఞాని మనలనందరను గూడ మాయయని వదలివేసినాడేమో? అట్లు వదలివేసి తనలో తానానందించు చున్నాడేమో! లేక స్వప్నమును చూచినట్లుగా ఈ జగము నంతయు మాయామయముగా అనగా స్వాత్మకల్పితముగా భావించి తనలో తానానందించుచున్నాడో! యెవడన్ని వేళలలో అన్ని అవస్థలలో ఆనందించు చునే యుండునో? సంసారాన్ధకార నాశకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున శుద్ధుడైన ఆత్మరూపహరి నానాకార సత్త్వరజస్తమోగుణభేదముతో భిన్నుడై జడోపాధి పరిచ్ఛిన్నుడై వైచిత్ర్య వైవిధ్యములతో తోచునని చెప్పబడుచున్నది.

శ్లో॥ పశ్యన్ శుద్ధో2ప్యక్షర ఏకో గుణభేదా
న్నానా22కారా త్స్ఫాటికవ ద్భాతి విచిత్రః।
భిన్న శ్ఛిన్నశ్చాయ మజః కర్మఫలై ర్య
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 17

ప్రతిపదార్థము:- పశ్యన్=ద్రష్టయైన, శుద్ధః=సుఖదుఃఖశూన్యుడు, అక్షరః= నాశములేని, ఏకఃఅపి=ఒకడైనను, స్ఫాటికవత్=స్ఫటికమణివలె, భాతి=ప్రకాశించుచున్నాడో, నానాకారాత్=వివిధాకారములుగల, గుణ భేదాత్=గుణభేదము వలన, విచిత్రః=విచిత్రుడై, అయమ్=ఈ, అజః=పుట్టుకలేని, యః=ఎవడు, కర్మఫలైః=కర్మఫలములలో, భిన్నః=భిన్నుడై (నట్లు) ఛిన్నఃచ=పరిచ్ఛిన్నుడై(నట్లు), తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్= సంసారాంధకార నాశకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ద్రష్ట, శుద్ధుడు, అక్షరుడు ఒక్కడునైనను నానాకార సత్వరజస్తమో గుణభేదమున స్ఫటికమువలె విచిత్రుడై కర్మఫలములతో భిన్నుడైనట్లు పరిచ్ఛిన్నుడైనట్లు ఎవడు తోచునో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- దృశ్యములు వేరువేరైనను ద్రష్ట యొకడుగానే ఉండుట మనకనుభవ సిద్ధమే. సత్వరజస్తమో గుణములు, తెలుపు, ఎరుపు, నలుపు రంగుల వంటివి. ఈ మూడు గుణముల సామ్యవైషమ్యములవలన లయము సృష్టి ఏర్పడును. వైషమ్యము కలుగగానే మహత్తు మొదలు పాంచభౌతిక బ్రహ్మాండము వరకు గల సృష్టి యంతయు క్రమముగా ఏర్పడును. సర్వవ్యాపకమైన ఆత్మ ప్రకృతిలో ప్రతిబింబించగా ప్రకృతి మహత్తుగా పరిణమించును. ఆ క్రమమున సృష్టమునందు మరల ప్రతిబింబించగ మరొక పరిణామము ఏర్పడుచుండును. భిన్నముగా పరిణమించిన ప్రాకృతిక లేక మాయామయ పదార్థములలో ప్రతిబింబించిన శుద్ధాత్మ 'స్ఫటికమణి దాసాని పూవు యొక్క సాన్నిధ్యమున ఎరుపును పొందినట్లు కనబడినట్లు' విచిత్రములైన ఆకారములను పొందినట్లు కనబడును. గుణముల వలననే అకర్తయైన ఆత్మ కర్తయైనట్లు ఆకర్మల ఫలములైన భోగములను అనుభవించు భోక్తయైనట్లును తోచును. ప్రతి పరిణత వస్తువునందును సత్వ రజస్తమో గుణవైషమ్యముండును. అట్లే బహుపరిణతములందు ప్రతిబింబించిన ఆత్మకూడ వేరువేరు గుణములు వాని వైషమ్యములు కలవాడైనట్లు తోచును. సత్వ గుణము వలన పుట్టిన ఆర్జవము మొదలగు గుణముల వలన దానాది కర్మలాచరించును. రజోగుణము వలన పుట్టిన రాగద్వేషములు మొదలగు

గుణముల వలన వివాహయుద్ధాతి కర్మలను నొనరించును. తమోగుణము వలన పుట్టిన మోహము, సోమరితనము మొదలగు గుణముల వలన కర్తవ్యకర్మల మానివేయుట మొదలగు కర్మల నొనరించును. ఆ కర్మలకు తగినట్లు సుఖదుఃఖ ఫలముల ననుభవించుచు కర్తగా, భోక్తగా కనబడును. ఇట్లు అఖండము సర్వవ్యాపకమునైన ఆత్మ పరిచ్ఛిన్న వివిధ జీవులుగా తోచును. ఒక్కడైన ఏ హరి ఇట్లు పెక్కులుగా కనబడునో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ఉపాధి భేదమున బహుధా భిన్ననిగా ఒక్క హరినే పేర్కొందురని చెప్పబడుచున్నది.

శ్లో॥ బ్రహ్మే విష్ణూ రుద్ర హుతాశౌ రవిచంద్రా
వింద్రో వాయు ర్యక్ష ఇతీత్థం పరికల్ప్య।
ఏకం సంతం యం బహుధా 22హు ర్మతి భేదా
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 18

ప్రతిపదార్థము:- బ్రహ్మే=బ్రహ్మ, విష్ణుః=విష్ణువు, రుద్రహుతాశౌ= రుద్రుడు, అగ్ని, రవిచంద్రౌ = సూర్యుడు, చంద్రుడు, ఇంద్రః=ఇంద్రుడు, వాయుః=వాయువు, యక్షః=యక్షుడు, ఇతి=అని, ఇత్థమ్=ఈవిధముగా, పరికల్ప్య=కల్పించి, ఏకమ్=ఒకడుగా, సంతమ్=ఉన్న, యమ్=ఎవనిని, బహుధా =అనేక విధములుగా, మతిభేదాః= భిన్నబుద్ధులు గలవారు, ఆహుః=చెప్పెదరో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఒక్కడుగానున్న ఏ హరిని బ్రహ్మగా, విష్ణువుగా, రుద్రుడుగా, అగ్నిగా, సూర్యుడుగా, చంద్రుడుగా, ఇంద్రుడుగా, వాయువుగా, యక్షుడుగా ఈ విధముగా అనేక భేదములు కల్పించి చెప్పెదరో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

వివరణము:- ఏ పేరులేని హరిని బ్రహ్మయని కొందరు పేర్కొనిరి, కొందరు విష్ణువని పేర్కొనిరి. మరికొందరు రుద్రుడనిరి. ఇంకొకరు అగ్నియనిరి. మరొకరు ఇంద్రుడనిరి. మరింకొకరు వాయువనిరి. అన్యులు

యక్షుడనిరి. ఇట్లు పేర్కొనిన వారిలో తత్త్వమును గ్రహించిన వారు పేర్లు వేరైనను తత్త్వమున భేదములేదని చెప్పిరి. మరికొందరు నీ దేవతలందరు బిన్న గుణములు, భిన్నస్వభావములు కలవారని చెప్పిరి. వారిక్రియలు వేరువేరని చెప్పిరి. మరికొందరు తమకు నచ్చిన పేరు నొకదాని నెన్నుకొని మిగిలిన వాతని పేర్లు కాదని వేరుపేర్లు కలవారి రూపగుణ క్రియలు వేరువేరని చెప్పుచు వీరందరు తామెన్నుకొన్నపేరు గల వారికి దాసులని చెప్పిరి. మఱికొందఱు అవయవములు అని చెప్పిరి. పరమాత్మను రుద్రుడని పేర్కొనినవారు మిగిలిన పేర్లుగల వేర్వేరు దేవతలు విష్ణ్వాదులు రుద్రునకు సేవకులని, అవయవములని చెప్పిరి. పరమాత్మను విష్ణువని పేర్కొనినవారు రుద్రాదులు విష్ణువునకు సేవకులని, అవయవములని చెప్పిరి. ఇంతటితో ఆగక విష్ణురుద్రులు పరస్పరము యుద్ధ మొనరించినారని వారిలో విష్ణువు గెలిచెనని కొందరు, రుద్రుడు గెలిచెనని కొందరు, పురాణముల తాత్పర్యము గ్రహింపక స్థూలముగా తోచునర్థమునే పట్టుకొని వేలాడిరి. ఈ విధముగా విష్ణువు సర్వశ్రేష్ఠతతో పాటు రుద్రాదుల అల్పత్వమును వైష్ణవులు, రుద్రుని సర్వశ్రేష్ఠతతోపాటు విష్ణ్వాదుల అల్పత్వమును శైవులు, ప్రతిపాదించుటతో పాటు రుద్రుని నిందతద్భక్తుల నింద చేయనిదే వైష్ణవులకు, విష్ణునింద, తద్భక్తులనింద చేయనిదే శైవులకు తెల్లవారని పరిస్థితి ఏర్పడినది. విష్ణుపారమ్యమునుగాని, శివపారమ్యమునుగాని, దేవీ పారమ్యమును గాని, గణేశపారమ్యమునుగాని, సౌరపారమ్యమునుగాని, సుబ్రహ్మణ్య పారమ్యమును గాని ఉపాసించుటలో నెంత మాత్రము దోషముగాని, అనౌచిత్యముగాని లేదు. కాని తదితర నిందలో అనౌచిత్యమున్నది. ఈ పారమ్యమున భక్తిదే ప్రధాన స్థానము. భక్తియనగా ప్రేమ. శివ పారమ్యము గల శివభక్తుడు సర్వమును శివమయముగా, విష్ణుపారమ్యముగల వైష్ణవుడు సర్వమును విష్ణుమయముగా చూచి తరించవలెను. తదితరుల పారమ్యముగల వారు కూడ నిట్లే చేసి తరించవలెను. కాని భక్తి సిద్ధాంతమునకే విరుద్ధమయిన ద్వేషము నవలంబించి పతితులు కారాదు. పరమాత్మగా విష్ణువును భావించినప్పుడు అగ్ని ఆతనికి ముఖము. బ్రహ్మ శిరస్సు, రుద్రుడు శిఖ, కన్నులు సూర్యచంద్రులు. ఈ రీతిగా ఇతర దేవతలు నా పరమాత్మయొక్క అవయవములుగా భావించ వలెను.అట్లే శివుని పరమాత్మగా భావించునప్పుడు శిరస్సు బ్రహ్మ, విష్ణువు

హృదయము, సూర్యచంద్రాగ్నులు నేత్రములుగా భావించునప్పుడు ఈ విధమైన భావనను అంగాన్యన్యాదేవతాః అనుసూక్తి సమర్థించును. వైశ్వానర హిరణ్యగర్భోపాసనలలో నీ పద్ధతి అంగీకరింపబడినది. ప్రత్యక్షముగా కనబడు అగ్ని సూర్యచంద్రులను ప్రతీకములుగా చేసికొని తదంతర్యామిగా పరమాత్మ ను భావించుట కూడ శాస్త్రసమ్మతమే. సూర్య ప్రతీకముగా వైష్ణవులు, శైవులు, విష్ణువును శివుని సంధ్యోపాసన సమయమున ధ్యానించుట శిష్టాచారమే. శ్రీలలితా సహస్ర నామ స్తోత్ర పీఠికలో చంద్రబింబమున అమ్మవారి ధ్యానము చెప్పబడినది. అగ్ని యందు సమస్త దేవతల నుద్దేశించి ఆహూతుల సమర్పించుట శిష్టాచారమే. ఉపనిషత్తు వాయో! త్వమేవ ప్రత్యక్షమ్ బ్రహ్మాసి అని వాయుస్తుతి చేయుచున్నది. పై శ్లోకమున పేర్కొనబడిన పదములన్నిటికి నిర్గుణ సగుణ పరమాత్మ పరముగా వ్యుత్పత్తులను చెప్పుట సహస్రనామ భాష్యాదులలో కన్పించును. ఈ పద్ధతులన్ని శాస్త్రీయములే. రాజభటులు మనయిండ్లకు వచ్చినప్పుడు రాజునకువలె మర్యాదచేయుట ఆవశ్యకాచారము. అట్లే పరమాత్మ భృత్యులైన ఇంద్రాదులను పరమాత్మను స్తుతించినట్లు స్తుతించుటయు శాస్త్రీయమే. శిలావృక్షాదులందు అదృశ్యయక్షులను పూజించుట గ్రామీణులలో అధికముగ కనిపించును. ఏదేమైనను ఒకే పరమాత్మను పెక్కు నామములతో పేర్కొనుట ప్రపంచమంతటను ముఖ్యము గా భారతదేశమున ప్రచురమై యున్నది. ఏ పేరుతో పిలచినను ఏ రూపమును ధ్యానించినను తత్త్వమొక్కటే అనుట ఈ శ్లోకము యొక్క సంగ్రహార్థము.

అవతారిక:- ఈ శ్లోకమున యజుర్వేదీయ తైత్తిరీయోపనిషత్తు నందు భృగువునకు ఆతని తండ్రియైన వరుణుడేమని చెప్పెనో చెప్పబడుచున్నది.

శ్లో॥ సత్యం జ్ఞానం శుద్ధ మనంతం వ్యతిరిక్తం
శాంతం గూఢం నిష్కల మానంద మనన్యమ్।
ఇత్యాహా౽౽దౌ యం వరుణో౽సౌ భృగవే౽జం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 19

ప్రతి పదార్థము:- సత్యమ్=త్రికాలాబాధ్యము, జ్ఞానమ్=చిన్మాత్రము, శుద్ధమ్=ఉపాధిరహితము, అనంతమ్=త్రివిధపరిచ్ఛేద రహితము, అనన్యమ్=

అభిన్నము. నిష్కలమ్= అంశములులేనిది లేక పరిపూర్ణము. ఆనందమ్= ఆనందము. వ్యతిరిక్తమ్= పంచకోశభిన్నమైన. శాన్తమ్=సర్వోపద్రవరహితమైన. గూఢమ్=గ్రహింపబడనిదియు. ఇతి=అని. ఆదౌ=మొదట. అసౌ వరుణః= ఈ వరుణుడు. భృగవే=భృగువుకొఱకు. యమ్=ఏ. అజమ్=పుట్టుకలేని హరిని గూర్చి. ఆహ=చెప్పెనో. తమ్= ఆ. సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నివారకుడైన. హరిమ్=హరిని. ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఉపనిషదారంభమున సత్యము జ్ఞానము నిర్మలము అనంతము, నిష్కలము అనన్యము ఆనందము అని వరుణుడు భృగువు కొఱకు ఏ హరిని గూర్చి చెప్పెనో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

వివరణము:- బ్రహ్మ సత్యం జగన్మిథ్యా అనునది అద్వైత వేదాంత సిద్ధాంత వాక్యము. జాగ్రదవస్థలో మనమీ ప్రపంచమును చూచుచున్నాము. సత్యము అని నమ్ముచున్నాము. ఈ ప్రపంచములోని వస్తువులన్నియు మనకే రూపమున కన్పడుచున్నవి. అగ్నికాలునది అని అందఱము నమ్ముచున్నాము. అది అందఱకు ఏక రూపముగా వేడిని కలిగించుచునే యున్నది.అగ్ని వేడిగా నుండుననియే అందఱు వ్యవహరించు చున్నారు. సర్వజీవులు ముఖ్యముగా మానవాదులు వ్యవహరించుటచే నీజగము వ్యావహారికముగ సత్యము. వ్యావహారిక సత్యము. వ్యావహారికముగ సత్తకలది. వ్యావహారిక సత్త గలది. ఒకడు నిద్రించుచు కలలో నేనుగును చూచెను. ఏనుగును చూచితినని మేల్కొనిన (లేచిన) తరువాత ఇతరులకు చెప్పెను. ఆ ఇతరుడు కలగనలేదు. కలలో ఏనుగును చూడలేదు. ఈతడు చెప్పినది సత్యమని గాని అసత్యమని గాని చెప్పలేడు. ఈతడు కలలో చూచునప్పుడితరు లెవఱును లేరు. కావున కావచ్చును అనిరి అంతేకాని అవునని చెప్పవలెననిన ఆతడు చూడలేదు గదా! ఇట్లొక్కని అనుభవములో నుండునది ప్రాతిభాసిక సత్యము. ఇది వ్యావహారిక సత్యముకాదు. వ్యవహరించుటకు వీలుకానిది. అట్లే తాడునందొకడు సర్పము చూచెను. భయపడెను. ఇతరుడది పాముకాదని ఆతని భయమును పోగొట్టెను. ఇతడొక్కడే పామును దర్శించెను. కావున ఇది వ్యవహారము కాలేదు. అందువలన ఇదియు ప్రాతిభాసిక సత్యమే. జాగ్రదవస్థలో వ్యావహారిక సత్యమైన

జగము నిద్రలోగాని స్వప్నములోగాని లేదు. ఆ నిద్రా స్వప్నములలో జాగ్రద్వ్యవహారము లేదుగదా! వ్యావహారిక సత్యము ప్రాతిభాసిక సత్యము వంటిదే. స్వప్నములోని ఏనుగు జాగ్రదవస్థలో కనబడక పోవుటే అసత్యమను చున్నాము గదా! జాగ్రదవస్థలోని ప్రపంచము స్వప్నములో లేదు గదా. దానిని మాత్రమెట్లు సత్యమనవలెను. సత్యమనిన అన్ని అవస్థలలో అన్ని కాలములలో (భూత, వర్తమాన, భవిష్యత్తులలో) ఏక రూపముగానుండవలెను అట్లుండునది యే సత్యము. ఆత్మ పదార్థమొక్కటే సాక్షిగా ఈ మూడు జాగ్రత్స్వప్న సుషుప్తులలోనున్నది. కావున అది యొక్కటి సత్యము. వ్యావహారిక సత్యమైన జాగ్రత్ప్రపంచము ప్రాతిభాసిక సత్యమైన స్వప్న ప్రపంచమును ఆత్మవలె త్రికాలాబాధ్యము కాదు. స్వప్న ప్రపంచము జాగ్రత్తున, జాగ్రత్ ప్రపంచము స్వప్నమున లేకపోవుటచే నివి తాత్కాలిక సత్యములే కాని పారమార్థిక సత్యములు కావు. ఈ శ్లోకమున సత్య శబ్దమునకు పారమార్థిక సత్యము అనగా త్రికాలాబాధ్యము అనగా అన్ని కాలములలో గోచరించునవి. కావున ఆత్మరూపహరి సత్యము అని ఈ శ్లోకము మొదట చెప్పబడినది. ఆత్మరూప హరి జ్ఞానము అని చెప్పబడినది. జ్ఞానము యొక్క ప్రకాశమునందే విషయములు తెలియబడుచుండును. దీపము తాను వెలుగుచూ ఇతర వస్తువులను వెలిగించునట్లు దీపము వంటి జ్ఞానము తాను వెలుగుచు ఇతర విషయములను వెలిగించును. ఇంద్రియములకు సన్నిహితములగు వస్తువులను ఇంద్రియద్వారముల నుండి విషయముపైబడి వానిని వెలిగించును. విషయములు లేకపోయినను తాను వెలుగుచునే యుండును. విషయేంద్రియము లన్నియు ప్రకృతి పరిణామములు. అద్వైత సిద్ధాంతమున ప్రకృతి మాయ అజ్ఞానమని చెప్పబడును. కల్పితములను సత్యములుగా చూచువానికి ఇవి కల్పితములని అద్వైత శాస్త్రము బోధించును. కల్పిత కల్పకములలో అజ్ఞానమాయలందు ప్రతిబింబించిన చైతన్యము ప్రతిబింబించి వాని పరిణామమునకు కల్పనకు హేతువగును. పరిణామము అనుటకన్న కల్పనమనుటయే ఉచితము. కల్పనలను వీడినచో తనకు తానే జ్ఞానము ప్రకాశించును. కల్పనలేదు కావున కల్పిత విషయ ప్రకాశనమను మాటయు లేదు. హరి శుద్ధుడు. సూర్యునావరించిన మేఘము ఇతరులకు సూర్యుడు మలినుడుగా కనబడునట్లు చేసినను సూర్యుని శుద్ధతకు భంగము లేనట్లు

జీవత్వము నొందినట్లు మలినుడైనట్లు కనబడినను తన శుద్ధ స్వరూపమున కెట్టి హానియురాదు. ఆత్మరూప హరి అనంతుడు. అంతము అనగా పరిచ్ఛేదము. అంతము లేనివాడు అనంతుడు. దేశకాల వస్తువులతో పరిచ్ఛిన్నుడు కాని హరి అనంతుడు అని చెప్పబడును. ఆత్మరూపహరి వ్యతిరిక్తుడు. వేనికన్న వ్యతిరిక్తుడు అని ప్రశ్నము కలుగును. ఆ ఉపనిషత్తు పూర్వపరములు పరిశీలించిన వారికా ఉపనిషత్తు పంచకోశముల కన్న వ్యతిరిక్తుడు అని తెలియును.పంచకోశములలో మొదటిది అన్నమయ కోశము. వెనుక చెప్పబడిన పాంచభౌతిక స్థూలశరీరము అందఱకు సులభముగా కనబడుచుండును. కావున అది స్థూలమని చెప్పబడినది. ఇది మాతాపితలు భుజించిన అన్నముచే నేర్పడిన అన్నమును తినుచునే కొంత కాలము జీవించి తిరిగి అన్నమయ పృథివిలోనికే లయమగును కావున ఇది అన్నమయ కోశము అని చెప్పబడినది. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, అన్నమయ కోశము లోపలివి. కావున అవి అంతఃకరణములు. ప్రాణములు శరీరములోనికి పోయివచ్చు చుండును. స్థూల శరీరమును ప్రాణరహిత మొనర్చు చుండును. మరణించి నప్పుడివి ఇంద్రియములతో కూడి బయటకు వెడలిపోయి మరొక స్థూల శరీరమును కర్మానుసారముగా ధరించును. మనసుతో కూడిన ఇంద్రియములు మనోమయకోశము, బుద్ధితో కూడిన ఇంద్రియములు విజ్ఞాన మయకోశము అని చెప్పబడును. ఈ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ కోశములు మూడు కలిసి సూక్ష్మశరీరమని చెప్పబడును. దీనికి కారణమై అంతరతరమైన ఆనందమయ కోశము కారణశరీరము అని చెప్పబడును. అజ్ఞానము సుఖదుఃఖానుభవ హేతువులైన విషయములు పోవుట, అజ్ఞానముచే ఆవరింపబడిన ఆత్మరూప హరి యొక్క స్వరూపానందమే భాసించు చుండుటచే దీనికానందమయ కోశమని పేరేర్పడినది. ఈ పంచకోశములకన్న ఆత్మరూపహరి వేఱు కావున వ్యతిరిక్తుడని ఆత్మరూప హరి చెప్పబడినాడు. ఆత్మ రూప హరి శాంతుడు. తరంగములు సముద్రమున అల్లకల్లోలము రేపును. ఆ తరంగములు లేవనుకొందము. అప్పుడు నిస్తరంగ సముద్రము శాంతముగా నుండునట్లు ఆత్మరూప హరి మాయాజ్ఞాన తత్కల్పిత విషయతరంగాది రహితుడు కావున శాంతుడని చెప్పబడెను. ఆత్మరూప హరి గూఢుడు. హరి ఎచట నున్నాడు? ఏ పుణ్యక్షేత్రమున వెదికినను అతడు

కనబడడు. ఆయన సాక్షాత్కారము కాదు. పుణ్యక్షేత్రములకు వెడలిన వారు తాత్కాలికముగ అల్పసుఖశాంతుల ననుభవించినను పరిపూర్ణ సుఖశాంతులు కలుగక పోవుటచే తిరిగి స్వగృహముల జేరి సంసార సుఖదుఃఖముల యధాప్రకారము అనుభవించుచునే యున్నారు. కావున ఆ పుణ్యక్షేత్రముల లోనే అతడక్కడ గూఢముగా నున్నాడని పెద్దలు చెప్పుచున్నారు. అందువలన ఆయన గూఢుడని యీ శ్లోకమున చెప్పబడినది. ఆత్మరూపహరి నిష్కలుడు. కల అనగా పదాఅవభాగము. ఆత్మరూప హరికి అంశములే లేనప్పుడు పదాఅవ అంశముకూడ లేదు. కావున నిష్కలుడు. చంద్రునకు పదాఱు కళలున్నట్లు ఆత్మరూపహరికి జ్ఞానకర్మేంద్రియదశకము విషయపంచకము అంత రింద్రియమును అను పదాఱు కలలున్నవని చెప్పబడినది. కాని అవి మాయాజ్ఞానాన్యతరోపాధి ననుసరించి చెప్పబడినవేకాని నిజముగా ఆతడు నిరంశుడే. కావున ఈ శ్లోకమున నిష్కలుడని చెప్పబడినది. విజ్ఞాన మానందమ్ బ్రహ్మ అని బ్రహ్మము జ్ఞానమని ఆనందమని ఉపనిషత్తు పేర్కొనుచున్నది. అందుచే ఆత్మరూపహరి ఆనందమని ఈ శ్లోకమున చెప్పబడినది. లోకములోని సుఖములన్ని ఈ ఆనందము యొక్క లేశములే. ఈ బ్రహ్మ ఆనందము పూర్ణమని చెప్పబడినది. ఆత్మరూపహరి అనన్యుడని చెప్పబడినది. చాలామంది ద్వైతులు తాను వేఱు హరివేఱని తలచు చుందురు. కావున హరి ఆత్మరూపుడేకాని వేఱుకాదు. అని చెప్పుటకు శ్లోకమున అన్యుడుకాదు అను అర్థముగల అనన్య శబ్దము ప్రయోగింపబడినది.ఇట్లు వరుణుడు భృగువున కే హరిని గూర్చి ఉపదేశించెనో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున వరుణుని ఉపదేశమున భృగువు తాను బ్రహ్మను అనగా హరినను జ్ఞానమును పొందుట చెప్పబడుచున్నది.

శ్లో॥ కోశా నేతా న్పంచ రసాదీ నతిహాయ
బ్రహ్మాస్మీతి స్వాత్మని నిశ్చిత్య దృశి స్థమ్।
పిత్రా 22దిష్టో వేద భృగు ర్యం యజురంతే
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 20

ప్రతిపదార్థము:- యజురంతే=తైత్తిరీయమను పేరుగల యజుర్వేదాంతమున (ఉపనిషత్తు), పిత్రా=తండ్రి (వరుణుని) చేత, ఆదిష్టః=ఉపదేశింపబడిన, భృగుః= భృగువు, ఏతాన్=ఈ, పంచ=అయిదు, రసాదీన్=అన్నమయాదులైన, కోశాన్ = కోశములను, అతిహాయ=అతిక్రమించి, స్వాత్మని =తన అంతరింద్రియమున, దృశిస్థమ్=దృశిగానున్న, బ్రహ్మ= బ్రహ్మను, అస్మి ఇతి=అయిఉన్నాను అని, నిశ్చిత్య=నిశ్చయించుకొని, యమ్=ఏ శ్రీహరిని, వేద=తెలిసికొనెనో, తమ్= ఆ, సంసారధ్వాన్త వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

**తాత్పర్యము:-** యజుర్వేదీయ తైత్తిరీయోపనిషత్తున తండ్రియైన వరుణునిచే ఉపదేశింపబడి భృగువు అన్నమయాది పంచకోశముల నతిక్రమించి దృశి రూపుడుగా నున్న బ్రహ్మను నేనని అనగా ఆ బ్రహ్మయే తన ఆత్మ, తన ఆత్మయే బ్రహ్మము అని నిశ్చయజ్ఞానము నొందెనో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- 'అన్న రసమయః' అని తైత్తిరీయోపనిషత్తున అన్నమయ కోశస్థుడు చెప్పబడినాడు. ఈతడు స్థూలశరీరి. ఈతనికే విశ్వుడనియు పేరు. శ్లోకములో రసాదీన్ అను సమాసమందలి రసశబ్దమునకు అన్న రసమయుడనియే అర్థము. కావున రసాదులనగా అన్నమయాదులు అను అర్థమేర్పడినది. అన్నమయాది పంచ కోశములను అతిక్రమించి వానికన్న భిన్నుడైన ఆత్మను బ్రహ్మగా భృగువు తండ్రి యుపదేశమున నిశ్చయించుకొని బ్రహ్మరూప హరి నెఱిగెను. బృహిధాతువు నుండి ఏర్పడినది బ్రహ్మశబ్దము 'అస' ధాతువు నుండి ఏర్పడిన క్రియ 'అస్మి', అను శబ్దము. ఇది ఆ ధాతువు యొక్క వర్తమానకాల బోధన లడంత ఉత్తమ పురుషైకవచనము కావున 'అహం' పదములేకున్నను 'బ్రహ్మాస్మి అను వాక్యమున 'అహం' పదమున్నట్లే. కావున 'బ్రహ్మాస్మి' అనగా 'అహం బ్రహ్మాస్మి' అనియే. బ్రహ్మ శబ్దమునకు సర్వజ్ఞత్వ, సర్వశక్త్యాది మద్వస్తువు అని అర్థం, అనగా చాలా గొప్పది. **'అహమ్'** అను శబ్దమునకు కించిజ్జత్వ, అల్పశక్త్యాది మద్వస్తువు అని అర్థం. **'అస్మి'** అను పదము ఈ రెంటి ఐక్యము ఉత్తమ పురుషునందు(తనయందు)**ండుట** ను తెలుపుచున్నది. సర్వజ్ఞత్వాది విశిష్టుడు బ్రహ్మ శబ్దవాచ్యుడు, **కించిత్**

జ్ఞాత్వాది విశిష్టుడు జీవశబ్దవాచ్యుడు. ఈ ఇద్దరికి అస్మిఅని ఏకత్వము చెప్పుట ఎట్లు కుదురును? అని ప్రశ్నయేర్పడును. పై వాచ్యార్థములైన సర్వజ్ఞత్వాది విశిష్టునకు కించిజ్జత్వాది విశిష్టునకు ఐక్యము కుదరనిమాట వాస్తవమే. కాని సర్వము నెఱుగుట అనుదానిలో కించిత్తు నెఱుగుట అనుదానిలోని సర్వ, కించిత్తులను తొలగించినచో ఎఱుగుట అనునది ఉభయులకునున్నది. కావున ఇరువుర కైక్యము కుదురును. కాని సర్వ, కించిత్తులను తొలగించుట ఎట్లు? లక్షణా వృత్తిచే తొలగించ వచ్చును. వాచ్యార్థము కుదురనప్పుడు లక్షణావృత్తి వాక్యము యొక్క అర్థమును కుదించును. బ్రహ్మ శబ్దవాచ్యార్థము (పదార్థము) సర్వము నెఱగువాడు అని దానిలోని సర్వమును 'అహం' శబ్ద వాచ్యార్థము (పదార్థము) కొంచెము నెఱుగువాడు అని దానిలోని సర్వము, కొంచెమను విశేషములు ఈ రెండు విశేషములను తొలగించి విశిష్ట విశేష్యార్థమును స్వీకరించు లక్షణావృత్తిని జహదజహల్లక్షణావృత్తి అందురు. విశేషణాంశ హానము (జహద్) విశేష్యాంశము యొక్క అహానము (అజహత్) రెండును ఉండుటచే ఈ లక్షణ జహదజహల్లక్షణ అనబడును. అప్పుడు ఎఱుగువాడు 'జ్ఞ' మిగులును. 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యము యొక్క అర్థము 'జ్ఞ' ఎఱుగువాడను అనియే ఉత్తమ పురుషము కావున తాను జ్ఞాతృ(జ్ఞానము) మాత్రుడనను వాక్యార్థము లభించును. పదార్థములోని కొంతను పరిత్యాగము చేసి అఖండ వాక్యార్థము గ్రహింపబడుట ఇందులోని విశేషము. ఇట్టి లక్షణ (జహదజహల్లక్షణ) మరెచ్చటనైన ఉన్నదా అను ప్రశ్నమునకు సోయందేవదత్తః వంటి వాక్యములందున్నదని సమాధానము. ఎప్పుడో చూచిన వానిని సః అను పదము, ఇప్పుడు చూచిన వానిని 'ఆయం' అను పదము బోధించును. అనగా గడిచిన దేశకాలమును బోధించు 'సః'అను పదమునకు అర్థమైన భూత దేశకాల విశిష్టములోని గడచిన దేశకాలములను తొలగించగా అయం అను పదమునకు అర్థమైన వర్తమాన దేశకాల విశిష్టములోని వర్తమానదేశకాలములను తొలగించగా దేవదత్తైక్యము అను అఖండమైన వాక్యార్థము సిద్ధించుట లోకవ్యవహార ప్రసిద్ధము. అట్లే 'అహం బ్రహ్మాస్మి' అను వాక్యము యొక్క అఖండ వాక్యార్థము సిద్ధించును. ఇట్లు ఏ హరియందు జీవ బ్రహ్మైక్యము సిద్ధించి భృగువు సంసారము నుండి ముక్తుడయ్యెనో ఆ సంసారాంధకార నివారకుడైన హరినే స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి యొక్క మాయోపాధిగత శక్తి చేతనే కర్తృత్వ కారయితత్త్వ, భోక్తృత్వాదులు క్షేత్రజ్ఞు (జీవుని) యందేర్పడుట చెప్పబడుచున్నది.

శ్లో॥ యేనాऽऽవిష్టో యస్య చ శక్త్యా యదధీనః
క్షేత్రజ్ఞోऽయం కారయితా జంతుషు కర్తుః।
కర్తా భోక్తాऽऽత్మాऽత్ర హి యచ్ఛక్త్యధిరూఢ
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 21

ప్రతి పదార్థము:- అయమ్=ఈ, క్షేత్రజ్ఞః=క్షేత్రము నెఱుగువాడు (జీవాత్మ), యేన= ఏ హరి పరమాత్మచేత, ఆవిష్టః=ఆవేశింపబడెనో, యస్య=ఎవని యొక్క, శక్త్యా=శక్తితో, క్షేత్రజ్ఞః=క్షేత్రము నెఱుగువాడయ్యెనో, యదధీనః=ఎవనికి అధీనుడైయుండునో, జంతుషు=జంతువులయందు, కర్తుః=కర్మచేయువానికి, కారయితా = చేయుంచువాడు అయ్యెనో, యచ్ఛక్త్యా =ఎవని యొక్క శక్తిచేత, అధిరూఢః=ఎక్కబడినవాడై, ఆత్మా=తాను, అత్ర= ఇచ్చట, కర్తా=కర్త (చేయువాడు), భోక్తా=అనుభవించువాడు అగుచున్నాడో, తమ్=ఆ, సంసారధ్వాంతవినాశమ్= సంసారాన్ధకారనివారకుడైన, హరిమ్= హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ఎవనిచే ఆవేశింపబడి, ఎవనికి లోబడి, ఎవనిశక్తితో జీవాత్మ, క్షేత్రజ్ఞుడు కర్తయగు చున్నాడో, జంతువులందలి కర్తకు కారయిత యగుచున్నాడో ఆ ఆత్మస్వరూపుడైన సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- క్షేత్రమనగా పొలము దాని పోలిక ననుసరించి పొలమున వరి మొదలగు పంటలు పండినట్లు శరీరమున సుఖదుఃఖములు అను పంటలు పండుచున్నందున శరీరము కూడా క్షేత్రమనబడినది. ప్రతిజీవునకు ఒక శరీరముండును. అది మిక్కిలి చిన్నదైన కావచ్చును. మిక్కిలి పెద్దదైన కావచ్చును. ఆ జీవుడు ఆ శరీరము నెఱుగును. కావున జీవునకు క్షేత్రజ్ఞుడను వ్యవహారమేర్పడినది. 'అయం' ఈ (కనబడు) అని చెప్పుటచే కనబడుశరీరము నందున్నవాడు క్షేత్రజ్ఞుడు అని తెలియును. ఈ క్షేత్రమును నాది అని

ఎఱుగువాడగుటచే ఆ పేరు సార్థకముగా కూడనున్నది. క్షేత్రజ్ఞునిచే తెలియబడునది క్షేత్రమని, దాని నెఱుగువాడు క్షేత్రజ్ఞుడని స్పష్టమైనది. ఈతని కీక్షేత్రజ్ఞత ఎవని శక్తిచేత కలిగిన దను ప్రశ్నమునకు హరిశక్తిచేత అని సమాధానము చెప్పుకొనవలెను. ఈ క్షేత్రజ్ఞుడు పూర్వకర్మానుసారముగా సుఖ దుఃఖములను అనుభవించుచూ భోక్తయని, వాని వాసన ననుభవించి మరల పుణ్య పాపకర్మలను వివరించుచూ కర్తయని మేకలు, గొఱ్ఱెలు, ఎద్దులు మొదలగు జంతువులతో పనిచేయించుచూ కారయితా అని పిలువబడు చున్నాడు. ఆ జంతువులోని క్షేత్రజ్ఞుడు కర్త, మనుష్యునిలోని క్షేత్రజ్ఞుడు కారయితా. మొత్తము మీద క్షేత్రజ్ఞుడే కర్త, కారయితయు అగుచున్నాడు. ఇట్లు కర్తయు, కారయితయు అగుటకూడా హరిశక్తిచేత నధిరూఢుడైన హేతువుచేతనే. ఒక క్షేత్రము నెఱుగువాడు జీవుడుకాగా సర్వక్షేత్రము నెఱుగువాడు హరి. వాస్తవమునకు సర్వక్షేత్రము నెఱుగువాడే ఈ క్షేత్రమును కూడ నెఱుగును. సర్వక్షేత్రజ్ఞుడైన హరినే నేను అని యే హరి స్వక్షేత్రజ్ఞుడు అనగా తానే అని ఏ హరి నెఱుగునో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరియే సత్యమిథ్యా స్వరూపము కావున సర్వము హరియే అని చెప్పబడుచున్నది.

శ్లో॥ సృష్ట్వా సర్వం స్వాఽఽత్మతయైవేత్థ మతర్క్యం
వ్యాప్యాథాంతః కృత్స్న మిదం సృష్ట మశేషమ్।
సచ్చ త్యచ్చాభూ త్పరమాత్మా స య ఏక
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 22

ప్రతిపదార్థము:- ఇత్థమ్=ఈ విధముగా, స్వాత్మతయాఏవ = స్వాత్మ రూపముగనే, అతర్క్యమ్=ఊహకందని, సర్వమ్=సర్వమును, సృష్ట్వా =సృజించి, అథ=పిమ్మట, ఇదమ్=ఈ, కృత్స్నమ్=మొత్తమును, అశేషమ్= మిగులకుండా, సృష్టమ్=సృష్టముగా, అన్తః=లోపలను, వ్యాప్య=వ్యాపించి, యః=ఏ, ఏకః=ఒకడైన, పరమాత్మా =పరమాత్మయైన, సః= ఆతడు (హరి), సత్‌చ = సత్తును, త్యత్‌చ = మిథ్యయును, అభూత్ = ఆయెనో, తమ్=ఆ,

సంసారధ్వాంతవినాశమ్= సంసారాన్ధ కార నివారకుడైన, హరిమ్ = హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- స్వాత్మరూపముగనే, ఊహకందని సర్వజగమును సృజించి దానినంతను స్పష్టముగా వ్యాపించి ఒక్కడైన ఏ హరి పరమాత్మ సత్తుగను, త్యత్తు (మిథ్య) గను ఆయెనో సంసారాంధకార నివారకుడైన ఆ హరినే స్తుతించెదను.

వివరణము:- తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్ అను శ్రుత్యర్థము నీ శ్లోకమందలి పూర్వార్థము తెలుపుచున్నది. ఈ జగమునంతను హరియే సృజించి నాడు. దానిలో నంతటను వ్యాపించినాడు. మట్టిలో నుండి కుండ ఏర్పడినది. కావున మట్టి దానిని సృజించెనందము. సృజింపబడిన కుండ యందంతట వ్యాపించి యున్నది కూడ మట్టియే కదా! మట్టి జడము కావున స్వయముగా కుండను సృజించలేదనవచ్చును. హరి మాత్రము మట్టివలె నీ కుండవంటి జగమును సృజించి దాని యందంతట వ్యాపించెను. కుండకు మట్టి ఉపాదానకారణము మాత్రమే. నిమిత్తకారణము చేతనుడైన కుమ్మరి. ఇచ్చుట మట్టియు, కుమ్మరివాడును హరియే. ఇది ఎట్లు? అని ప్రశ్నించ వచ్చును. సాలెగూడునకు సాలెపురుగే ఉపాదానకారణము, నిమిత్తకారణము కూడా. అట్లే ఈ జగమునకంతటికి హరి అభిన్న నిమిత్తోపాదాన కారణమై యున్నాడు. ఉపాదాన కారణమనగా కార్యమునకు ముందుండి కార్యదశ యందు నుండి కార్యమును తనలో లీనము చేసికొనునట్టిది. కుండను గూర్చి చెప్పనప్పుడిదేమియన్నచో మట్టి అనియే అందుము. అట్లే బంగారు ఆభరణములకు బంగార ముపాదానకారణము. కార్యదశలో కూడా అది బంగారమే. కావున బంగారమనియే చెప్పబడును. జ్ఞానమనగా 'వాసుదేవ స్సర్వమ్' సర్వమును వాసుదేవుడు అనునదే జ్ఞానము. ఈ జ్ఞానము బహు జన్మల అనంతరమున కలుగు జ్ఞానము అని శ్రీమద్భగవద్గీత యందు చెప్పబడినది. ఈ జ్ఞానము కలవాడే నన్ను పొందుననియు కృష్ణరూపహరి చెప్పినాడు. సాలెగూడు సాలెపురుగు నుండి ఉద్భవించి కొంతకాలము బయట వుండి చివఱకు సాలెపురుగులోనే లీనమగును. సాలెపురుగు సాలెగూడును పుట్టించి కొంతకాలము జీవింప నిలచునట్లు జేసి తిరిగి తనలోకి తీసికొనునట్లు

హరి ఈజగమును పుట్టించి కొంతకాలము జీవింపజేసి తిరిగి తనలోనికి లీనమొనరించుకొనును. కాన హరియే జగము యొక్క ఉపాదాన కారణము. సాలె పురుగు సాలెగూడునకువలె ఆతడే చేతనుడు కావున నిమిత్త కారణము కూడ నతడే ఈ జగమున జడచేతన పదార్థములు రెండునున్నవి. జడము త్యత్తుఅనబడును. చేతన పదార్థము సత్తు అనబడును. జడము మిథ్య అనగా దృశ్యము. కావున ఈ శ్లోకము మూడవ పాదము సత్తుగా త్యత్తుగా సర్వము నొకే పరమాత్మ రూపుడైన హరి ఆయెనని చెప్పబడెను. ఈ మూడవ పాదము 'సచ్చత్యచ్చాభవత్' అను శ్రుతి వాక్యమున కనువాదమే. త్యత్తు అను పదమునకు మిథ్య అను అర్థము చెప్పబడినది కదా! దీనికన్న సత్తువేరే, అయినచో సత్తైనవాడు మిథ్య యెట్లగును. మిథ్యగా నెట్లు కనబడును. మిథ్య అయినచో సత్తు ఎట్లగును? అను ప్రశ్నము కలుగును. మిథ్య పదార్థ మందఱకు కనబడదు. ఎవడు సత్య వస్తువు నెఱుగడో వాడు మిథ్యా పదార్థమును సత్యమనుకొను చుండును. రజ్జువు నెఱుగని వాడికే సర్పము భాసించును. రజ్జువు నెఱిగిన వెంటనే సర్పము నశించును. అట్లే హరి యొక్క సత్యస్వరూపమును అనగా చైతన్య స్వరూపము నెఱిగినవాడు ఆ హరియందు ఈ జగమును చూచును. ఇదంతయు హరియే అని ఎఱిగిన వానికి జగము హరిగానే గోచరించును. కఱ్ఱ గుఱ్ఱము నెక్కి బాలుడాడు కొనును. అది కఱ్ఱయని తెలియక పోవుటచే బాలుడు గుఱ్ఱమనుకొనును, ఇది కఱ్ఱయని తెలియగానే పొయ్యిలో పెట్టును. కఱ్ఱయే గుఱ్ఱము అయినది. అనగా త్యత్తు అయినది. వాస్తవమునకు త్యత్తు అనునది లేనే లేదు. కావున అది కఱ్ఱకు భిన్నమై రెండు తనమును (ద్వైతమును) కలిగించదు. అట్లే జగము మిథ్య(త్యుత్తు) అయినను సత్తైన హరికి రెండు తనమును (ద్వైతమును) సంపాదించదు. ఏ హరి త్యత్తు సత్తునై అద్వితీయముగానే ఉన్నాడో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- పై శ్లోకమున సర్వమును స్వాత్మరూపముగానే సృజించి దానిలో ప్రవేశించి సత్తుగ త్యత్తుగ సర్వమును తానేయై హరి యున్నాడని చెప్పబడినది. ఈ శ్లోకమున పై శ్లోకార్థమును సప్రమాణముగ గ్రహించి బుద్ధితో నిశ్చితముగా తెలిసికొని జ్ఞానులు ఆ హరిలో ప్రవేశించినారని చెప్పబడుచున్నది.

శ్లో॥ వేదాన్తైశ్చాధ్యాత్మిక శాస్త్రైశ్చ పురాణై
శ్శాస్త్రైశ్చాన్యై స్సాత్వత తంత్రైశ్చ య మీశమ్।
దృష్ట్వా2థాన్త శ్చేతసి బుద్ధ్వా వివిశు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 23

ప్రతిపదార్థము:- వేదాన్తైః=ఉపనిషత్తులచేత, ఆధ్యాత్మిక శాస్త్రైఃచ= ఆత్మతత్త్వ బోధక సాంఖ్య యోగోత్తర మీమాంస శాస్త్రములచేత, పురాణైః= శ్రీమద్భాగవత శ్రీవిష్ణ్వాది పురాణములచేత, అన్యైః=ఇతరములైన, శాస్త్రైఃచ= (శాండిల్య నారదాది ప్రణీత భక్తి మీమాంసాది) శాస్త్రములచేత, సాత్వతతన్త్రైః= విష్ణుపారమ్యమును బోధించు సాత్త్వికములైన నారదపాంచరాత్రాద్యాగమముల చేత, యమ్=ఏ, ఈశమ్ =ఈశుని, అథ=పిమ్మట, దృష్ట్వా=పరోక్షముగ చూచి, చేతసి=మనసున, అన్తః= లోపలను, బుద్ధ్వా=తెలిసికొని, యమ్=ఎవనిని, వివిశుః=ప్రవేశించిరో, తమ్= ఆ, సంసారధ్వాన్త వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ఉపనిషత్తులచేత, సాంఖ్యయోగోత్తర మీమాంసాది శాస్త్రముల చేత, శ్రీమద్భాగవత విష్ణ్వాది పురాణములచేత ఇతరములైన నారదశాండిల్యాది ప్రణీతములైన భక్తి మీమాంసాది శాస్త్రముచేత విష్ణుపారమ్య బోధక సాత్త్వికారాధనా సంప్రదాయములను బోధించు సాత్వత తంత్రముల చేతను ఎవనిని పరోక్షముగా చూచి (మనసులోపల నెఱిగి) ఎవనిలో ప్రవేశించెదరో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- వేదములందు సంహితలు, బ్రాహ్మణములు, ఆరణ్యకములు, ఉపనిషత్తులు అను 4 భాగము లుండును. మంత్రములు కల భాగములు సంహితలు, గద్యములు గల భాగములు బ్రాహ్మణములు, ఆరణ్యములలో నుండి చేయదగిన దేవతల ఉపాసనల బోధించు గద్యభాగములు ఆరణ్యకములు, ఛందోబద్ధములు ఛందోరహితములునైన వాక్యములతో బ్రహ్మము యొక్క జ్ఞానమును బోధించునవి ఉపనిషత్తులు, వీనిలోన ఉపనిషత్తులు చివఱివి అగుటచే అనగా వేదముల యొక్క సంహితా బ్రాహ్మణారణ్యకముల అనంతరము చివఱనున్న వగుటచే ఉపనిషత్తులు

వేదాన్తములు అనబడును, ఉపనిషత్తులనగా గురువు దగ్గఱ కూర్చుండి నేర్చుకొనదగిన సంసార హేతువైన అవిద్య నశింపజేయు గ్రన్థములు అని అర్థము. హిరణ్యగర్భకపిల పంచ శిఖాదులచే నిర్మితమైన గ్రంథసముదాయము సాంఖ్యశాస్త్రమనబడును. పతంజలి వ్యాసాది నిర్మిత గ్రంథముల సముదాయము యోగశాస్త్ర మనబడును. శ్రీ శంకరాచార్యాది నిర్మిత శారీరక మీమాంసాది గ్రన్థ సముదాయము వేదాన్తశాస్త్రమనియు చెప్పబడుచున్నది. సాంఖ్యశాస్త్రము ద్వైత శాస్త్రము. అందున నాత్మప్రకృతి సత్యత్వవాదము చెప్పబడినది. అయినను ప్రకృతి పురుష వివేకమును వివరించు భాగము ప్రధానముగ ఆత్మ స్వరూప జ్ఞానమునకు తోడ్పడును. కావున సాంఖ్య శాస్త్రమంతయు ఉపనిషత్సిద్ధాంతములకు విరోధము లేనంత వఱకు ప్రమాణమే. అట్లే పతంజల్యాది నిర్మిత గ్రంథములలో చిత్తైకాగ్రతను బోధించు భాగము ప్రధానముగ ఉపాదేయమై ఉన్నది. అట్లే కైవల్యమును కలిగించు ఆత్మవిచారము కూడ అందున్నది. ఉపనిషత్సిద్ధాంత విరోధము లేనంతవరకు అదియును ప్రమాణమే. శ్రీ శంకరులు బ్రహ్మ సూత్రములను వివరించు శారీరకమీమాంసాదిభాష్యము, ఉపనిషద్భాష్యము, గీతాభాష్యము, సనత్సు జాతీయ భాష్యము, విష్ణుసహస్రనామ భాష్యము, ఇత్యాది గ్రన్థసముదాయము వేదాన్త శాస్త్రమని చెప్పబడును. ఇవి ఆధ్యాత్మిక శాస్త్రములు ముఖ్య ప్రమాణములు. మహా పురాణములు పదునెనిమిది, ఉప పురాణములు పదునెనిమిది, వ్యాస నిర్మితములై యున్నవి. వానిలో, శ్రీ విష్ణుపురాణము, భాగవతములలో హరితత్త్వము చక్కగా వివరింపబడినది కావున ఇవన్నియు వేద విరోధము లేనంతవఱకును ప్రమాణములు. అట్లే ఇతర నారద శాండిల్య ప్రణీతములైన భక్తి సూత్రములు ఈశ్వర మీమాంసాది గ్రన్థములు వేద విరోధముగ లేనంతవఱకు ప్రమాణములు. శ్రీ విష్ణుపారమ్యమును బోధించుచు సాత్త్వికములైన ఆరాధనా విధానములను బోధించుచు నారదాదులచే నిర్మింపబడిన పాంచరాత్రాద్యాగమ గ్రంథములును వేదవిరోధము లేనంతవరకు ప్రమాణములు. వేదాన్తములలో అనగా ఉపనిషత్తులలో కూడ ద్వైతబోధక మంత్రము లున్నను వానికి ప్రామాణ్యాము లేదు. లోకసిద్ధ విషయానువాచకత్వమే ఉన్నది. అపూర్వమైన జీవబ్రహ్మైక్య బోధక శ్రుతిభాగమే పరమ ప్రమాణము. మిగిలిన అంశములు ద్వైత బోధక

వాక్యములైనను పరంపరగా జీవబ్రహ్మైక్యము నందు పర్యవసించు వాక్యము లేవైనను వేదాన్త తాత్పర్యమునకు అనుకూలములు. కావున వానిని ప్రమాణములగానే ఎంచదగును. ఇట్లు రుచి ననుసరించి సత్‌గ్రన్థ సముదాయమును వీలైనంత అధికకాలము పఠించువారికి హరిస్వరూపము కనబడును. ఈ కనబడుట పరోక్షజ్ఞానమే. బ్రహ్మ పరోక్షసాక్షాత్కార రూప (పరబ్రహ్మానుభవ)ము కాదు. సంస్కృత భాషనెఱిగి కొంత వైదుష్యము కలవారు తమ కాలమును విద్వాంసుల సహవాసమున బ్రహ్మ చింతనము తోడను పైన పేర్కొనబడిన సద్గ్రంథ పఠనముతో కొంతకాలము గడుపుట మంచిదను ఉద్దేశముతో నేవి చదువదగినవో ఈ శ్లోకము ఆ గ్రంథముల సముదాయమును పేర్కొన్నది. అంత మాత్రముచే బ్రహ్మా నుభవము కలుగక పోవచ్చును. కాని పరోక్ష బ్రహ్మజ్ఞానము కలుగును. దానిని మనసున వివేకముతో నాలోచించి స్వాత్మయే హరియని నిశ్చయించు కొనవలెను. ఇట్టి నిశ్చయజ్ఞానము కలవాడు మరణానంతరము శ్రీహరిలో ప్రవేశించును. మరల ఆతనికి సంసారమున పునరావృత్తి లేదు. ఏ హరిలో బహుశాస్త్ర గ్రంథాధ్యయన మొనరించి ఆత్మసాక్షాత్కారమును పొందినవారు మరణానంతర మే హరిలో ప్రవేశించెదరో, ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున బ్రహ్మపరోక్ష సాక్షాత్కారమునకు సాధనములు కొన్ని చెప్పబడు చున్నవి.

శ్లో॥ శ్రద్ధా భక్తి ధ్యాన శమాద్యై ర్యతమానై
ర్జ్ఞాతుం శక్యో దేవ ఇహైవాఽఽశు య ఈశః।
దుర్విజ్ఞేయో జన్మశతై శ్చాపి వినా తై
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 24

ప్రతిపదార్థము:- యతమానైః=ప్రయత్నించు వారిచేత, శ్రద్ధాభక్తి ధ్యాన శమాద్యైః=శ్రద్ధ, భక్తి, ధ్యానము, శమము మొదలగు వానితో, దేవః=దేవుడైన, ఈశః= ఈశుడు (హరి), ఇహ ఏవ=ఈ లోకముననే, ఆశు=శీఘ్రముగా, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, శక్యః=వీలైనవాడో, తైః=అవి, వినా=లేక, జన్మశతైఃచ అపి= మార్లకొలది జన్మలతోడను, యః=ఏ పరమేశ్వరుడు, దుర్విజ్ఞేయః=

తెలియరాని వాడో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ప్రయత్నించువారు శ్రద్ధ భక్తి ధ్యాన శమాదిగుణ సంపన్ను లైనచో ఆ ఈశుడైన హరి ఈ లోకముననే తెలిసికొనుటకు వీలైనవాడు. శ్రద్ధా భక్త్యాదులు లేనిచో నెన్ని జన్మలెత్తినను (తెలిసికొను నాసక్తి యొక్కటి ఉన్నంత మాత్రమున) తెలిసికొనుటకు వీలుకాదు. అట్టి సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- యతమానులు అనగా యత్నించుచున్నవారు. అనగా ఆత్మతత్త్వమును బోధించు వాక్యముల విచారించుచు యుక్తులతో మననము చేయుచు ధ్యానించుచు నుండువారు. ఇట్లు ప్రయత్నించు చున్నను, వారు శ్రద్ధలేని వారైనచో వారికి ఆత్మతత్త్వ జ్ఞానము అనగా హరితత్త్వ జ్ఞానము కలుగదు. శ్రద్ధయనగా వేదాన్త గురు వాక్యములందలి విశ్వాసము ఆ వాక్యములు సత్యములని నమ్ముట శ్రద్ధ యనబడును. భక్తి అనగా నేనెవడను అను స్వస్వరూపాను సన్ధానము. శంకరాచార్యులు స్వస్వరూపాను సంధానమ్ భక్తి రిత్యభిధీయతే (స్వస్వరూపాను సంధానము భక్తి అనబడును.) అని చెప్పియున్నారు. శాండిల్యుడు భక్తిని రెండు విధములుగా పర అపర అని విభజించి ఈశ్వరుని యందలి అనురాగము పరాభక్తి అని చెప్పెను. 'పరానురక్తి రీశ్వరే' అనునది శాండిల్యపరాభక్తిని నిర్వచించు సూత్రము. నారదుడు సాత్వస్మిన్ పరమ ప్రేమ రూపా అను తమ భక్తిని నిర్వచించు సూత్రమున పరమేశ్వరుని యందలి పరమ ప్రేమ భక్తియని చెప్పిరి. మధుసూదన సరస్వత్యాదులు భగవద్ధర్మమున ద్రుతమైన, సర్వేశ్వరుని యందు ధారావాహికమైన మనోవృత్తియే భక్తియని చెప్పెను. శ్రీమద్భాగవతము భగవంతుని గుణకథాది శ్రవణస్మరణ కీర్తనములు, పాదసేవనము, అర్చనము, వందనము, అను కర్మ షట్కము, దాస్య సఖ్య భావద్వయము, ఆత్మ నివేదనము మొత్తము తొమ్మిదింటిని భక్తి యొక్క తొమ్మిది ప్రకారములని చెప్పినది. పై శ్లోకమున ధ్యానమును విడిగా పేర్కొనుటచే శ్లోకములోని భక్తి శబ్దమునకు సర్వేశ్వరు నందలి ధారావాహికమైన మనోవృత్తి భక్తియను నర్థమును గ్రహింపరాదు. మధుసూదనసరస్వత్యాదులు చెప్పిన భక్తియే ఈ శ్లోకములోని ధ్యానపదము

యొక్క అర్థము. శమాద్యములు అనగా శమము దమము ఉపరతి తితిక్ష సమాధానము అను నైదు గుణములు. 'శమాద్యైః' అను పదమునకు అర్థముగా గ్రహింపవచ్చును. ఏనికి శ్రద్ధ కలిపినచో శమాది షట్కము (సాధన చతుష్టయములోనొకటి) ఏర్పడును. శమమనగా మనస్సు యొక్క నిగ్రహము. దమమనగా బహిరింద్రియ నిగ్రహము. ఉపరతి యనగా సన్యసించుట. తితిక్ష యనగా సర్వదుఃఖముల నప్రతీకార పూర్వకముగా సహించుట, సమాధాన మనగా మానసిక తృప్తి. ఈ శ్రద్ధా భక్తి ధ్యాన శమాదులున్నవారు ప్రయత్నించుచో పరమాత్మ సాక్షాత్కారము పొందుటకు వీలున్నది కాని అవి లేనిదే ఏ హరి నూర్ల కొలది జన్మలెత్తినను ఏ హరిని తెలిసికొనుట సాధ్యము కాదో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున అబ్ధితరంగన్యాయమున హరి ప్రపంచైక్యము చెప్పబడుచున్నది.

శ్లో॥ యస్యాతర్క్యం స్వాత్మ విభూతేః పరమార్థం
సర్వం ఖల్విత్యత్ర నిరుక్తం శ్రుతివిద్భిః।
తజ్జాదిత్వా దబ్ధితరంగాభ మభిన్నం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 25

ప్రతిపదార్థము:- యస్య=ఎవనియొక్క, అతర్క్యమ్=ఊహకందని, స్వాత్మ విభూతేః=స్వాత్మవిభూతియొక్క, పరమార్థమ్=రహస్యము, శ్రుతివిద్భిః= వేదవేత్తలచేత, సర్వమ్ ఖలు ఇతిఅత్ర=సర్వము ఖల్విదం బ్రహ్మ అనుశ్రుతిని వ్యాఖ్యానించుచోట, నిరుక్తమ్=చెప్పబడిన, తజ్జాదిత్వాత్ = తజ్జలానితి శాంత ఉపాసీత అను ఉపాసనా వాక్యమున ప్రపంచ పదార్థము లన్నియూ పరమాత్మయందు పుట్టి జీవించి లయించు ననుటవలన, అబ్ధి తరంగాభమ్=సముద్రతరంగసమముగా, అభిన్నమ్=అభిన్నమో, తమ్= ఆ, సంసార ధ్వాంత వినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హ^ ^మ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:-వేదవేత్తలు నర్వం ఖల్విదమ్ బ్రహ్మ అను వేద వాక్యమును వ్యాఖ్యానించునప్పుడు పుట్టి జీవించి చచ్చు అలలు సముద్రమున

కెట్లు భిన్నములు కావో ప్రపంచ(భేద)ములన్నియు పరమాత్మయైన ఏ హరికి భిన్నములుకావని చెప్పబడినదో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- సర్వం ఖల్విదం బ్రహ్మ అను వేదవాక్యమును వ్యాఖ్యానించు వేదవేత్తలు ఈ కనబడు ప్రపంచమంతయు బ్రహ్మము అని నిరూపించుటకు దృష్టాంతముగా సముద్రతరంగ న్యాయమును చూపిరి. తరంగములు సముద్రములో పుట్టి జీవించి లయించుచుండును.పుట్టుట జీవించుట లయించుట అను అలల క్రియలు క్షణికములుగా సముద్రమున జరిగిపోవుచుండును. ఈ ప్రపంచములు కూడా పరమాత్మయైన హరి యందట్లే పుట్టి జీవించి లయించు చుండును. తరంగముల కున్నంత క్షణికత్వము ప్రపంచములకు లేకున్నను అవి కోట్ల కొలది సంవత్సరములు జీవించుచున్నను ఆ మహా కాలము కూడా అనంత కాలమున అత్యల్పము కావున క్షణికములే. అలలు పుట్టి జీవించి లయించినను వానికి సముద్ర భేదము లేదు. తద్భేదము సముద్రమునందును లేదు. సముద్రము యొక్క ఏకత్వమును అలలు భుజించలేవు. అలలు బహుత్వము సముద్ర ఏకత్వమును భుజింపలేవు. కావున సముద్ర తరంగా భేదము సంప్రతిపన్నము కావున అది దృష్టాంతముగా పరమాత్మ ప్రపంచముల ఐక్యము సమర్థింప బడినది. ఆ సందర్భమున తజ్జాదిత్వాత్ అను హేతువు చూపబడినది. ఉపనిషత్తున తజ్జలాన్ ఇతి శాంత ఉపాసీత అనువాక్యము ఉన్నది. ఈ శ్లోకమున తజ్జాదులనగా తజ్జ, తల్ల, తదన్ అనునవి ప్రపంచములకు చెప్పబడిన విశేషణములు. 'తజ్జ' అనగా పరమాత్మ నుండి పుట్టునవి, 'తల్ల' అనగా పరమాత్మ యందు లయించునవి, 'తదన్' అనగా పరమాత్మలోనే జీవించునవి. ఈ విధముగా ప్రపంచ (పదార్థ)ములు పరమాత్మయందే జనించినవి. కావున తజ్జములు పరమాత్మయందే లయించునవి కావున తల్లములు. అట్లే పరమాత్మయందే జీవించునవి కావున 'తదన్నులు' అని చెప్పబడినవి. తజ్జలాన్ అని శాంతుడై పరమాత్మ నుపాసింపలెను. ఈ వాక్యమున ప్రపంచ (పదార్థ) ములకు తజ్జత్వము, తల్లత్వము, తదన్యము ఉండుటచే సముద్రతరంగ న్యాయమున తద్భిన్నములు కావు అనుట దృష్టాంతముగా పరమాత్మ ప్రపంచముల యొక్క ఏకత్వము సమర్థింపబడి ఇదం(ఈ కనబడు)

సర్వమ్=ప్రపంచము లన్నియు) బ్రహ్మఖలు బ్రహ్మగదా అని శ్రుతి యొక్క అర్థ ముపపన్నమని వ్యాఖ్యానింపబడినది. సముద్రమన్నను తరంగమన్నను జలమే. సలిలమేవ హి తత్సమస్తం అని మరొకచోట చెప్పబడినట్లు ఇదంతయు హరి స్వాత్మవిభూతి యొక్క పరమాత్మ వివరణమే. ఇదియే ఆ 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అనుశ్రుతి యొక్క రహస్యార్థము. ఈ జగమంతయు పరమాత్మ విభూతియే అనుటలోని తాత్పర్యము నొక్కటే. ఈ రహస్య పరమార్థ తాత్పర్యము ఊహించి తెలిసికొనదగినది కాదు అని శ్లోకమునందలి 'అతర్క్యమ్' అను శబ్దము చెప్పుచున్నది. ఏ హరి యొక్క స్వాత్మవిభూతి రహస్య పరమార్థ తాత్పర్యము ఊహకందదో 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అను శ్రుతి వాక్యమున తజ్జాదిత్వాత్ అని హేతూపన్యాస పురస్సరముగా వేదవేత్తలు సముద్ర తరంగ న్యాయమున హరి ప్రపంచముల ఐక్యము నిరూపింపబడినదో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున హరి యొక్క గీతా ప్రతిపాద్యమైన అక్షరతత్త్వ ధ్యాన జ్ఞానములు ప్రస్తావింపబడుచున్నవి.

శ్లో॥ దృష్ట్వాగీతా స్వక్షర తత్త్వం విధినా2జం
భక్త్యా గుర్వ్యా22లభ్య హృదిస్థం దృశిమాత్రమ్।
ధ్యాత్వా తస్మి న్న స్మ్యహ మిత్యత్ర విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 26

ప్రతిపదార్థము:- అజమ్=పుట్టుకలేని, గీతాసు=భగవద్గీతలందు, అక్షర తత్త్వమ్=అక్షర (నాశములేని) తత్త్వమును, విధినా=(శాస్త్రోక్త) విధితో, దృష్ట్వా=తెలిసికొని, గుర్వ్యా=గొప్పనైన, భక్త్యా=భక్తితో, హృదిస్థమ్=హృద్గతుగా, దృశిమాత్రమ్=దృశిమాత్రుని, ఆలభ్య=బాగుగా పొంది, తస్మిన్=దానియందు, అహమ్=నేను, అస్మి=ఉన్నాను, ఇతి= అని, ధ్యాత్వా=ధ్యానించి, అత్ర=ఈ లోకమున, యమ్=ఎవనిని, విదుః= తెలిసికొందురో, తమ్=ఆ, సంసార ధ్వాంత వినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:- పుట్టుకలేని నాశములేని భగవద్గీతలోని అక్షర

తత్త్వమును శాస్త్రోక్త విధితో అధ్యయనముచేసి తెలిసికొని గొప్పభక్తితో దృఙ్మాత్రమైన ఆ తత్త్వమును తన హృదయమునందే నిలుపుకొని దానిలో నేను దృఙ్మాత్రుడ నున్నాను అని ఎవనిని తెలిసికొందురో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- శ్రీమద్భగవద్గీతలో అక్షర తత్త్వము అష్టమాధ్యాయము నందు, పదునైదవ అధ్యాయమునందునను ఇంకను అన్యాధ్యాయములందును అక్కడ డక్కడ చెప్పబడినది. దానిని శాస్త్రోక్త విధితో గ్రహింపవలెను అనగా శిష్యుడు (కర్రలను) చేత ధరించి సమిత్ పాణియై బ్రహ్మ నిష్ఠుడైన శ్రోత్రియుడైన గురువు నాశ్రయించి ప్రణిపాత పరిప్రశ్న సేవలద్వారా ఆయన అనుగ్రహమును సంపాదించి ఆయన చెప్పినట్లు నడుచుకొనుచూ ఆయన అనుగ్రహముతో ఆయన ఉపదేశించిన గ్రంథార్థమును గ్రహింపవలెను అని అర్థము. ముఖ్యముగా భగవద్గీతలోని అక్షరతత్త్వమును గ్రహింపవలెను. అష్టమాధ్యాయారంభమున 'కిం తద్ బ్రహ్మ' బ్రహ్మ అనునది ఏమి? అని అర్జునుడు ప్రశ్నించెను. కృష్ణుడా ప్రశ్నకు 'అక్షరమ్ బ్రహ్మ పరమ్' అక్షరము పరమ బ్రహ్మము అని చెప్పెను. అక్షరము బ్రహ్మ అని చెప్పక అక్షరము పరమ బ్రహ్మము అనుట ఏలా? అను ప్రశ్నము కలుగును. సమాధాన మేమనగా 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అని శ్రుతి యందు ఒక చోట చెప్పబడినది. పరమ అని చెప్పకపోయినచో అక్షరము బ్రహ్మము అని మాత్రము చెప్పినచో ఓంకారము అను ఒక అక్షరము బ్రహ్మము అను అర్థము వచ్చును. ఓంకారము శబ్దబ్రహ్మము. అది పరబ్రహ్మమునకు వాచకము (లక్షకము) లేదా ప్రతీకము కావచ్చును కానీ పరబ్రహ్మముకాదు. అందుచేత అక్షరము (పరమ) బ్రహ్మము అని చెప్పబడినది. ఈ అధ్యాయము చివరకూడా అవ్యక్తోక్షర ఇత్యుక్తస్తమాహుః పరమాం గతిమ్ (అవ్యక్తుడు అక్షరుడని చెప్పబడినాడు. ఆ అవ్యక్తాక్షరునే పరమగతియని (పెద్దలు) చెప్పెదరు) అని చెప్పబడినది. జగము అంతయు (క్షరము) నశించునది, వ్యక్తము అనగా ప్రమాణ వేద్యము అనగా తెలియబడునది. దాని వలె ప్రమాణవేద్యుడు కాని వాడు అవ్యక్తుడు అక్షరుడు (నాశములేనివాడు) అని చెప్పబడినాడు. అతడే పరమగతి చివరి దిక్కు గమ్యము ఆ వాక్యమునుకు ఇది అర్థము. అట్లే పదునైదవ **అధ్యాయమువ** 'క్షరః సర్వాణి భూతాని కూటస్థో అక్షర ఉచ్యతే'

(సర్వభూతములు క్షరపురుషుడు కూటస్థుడు అక్షర పురుషుడు) అని చెప్పబడినది. సర్వభూతములు నశించునవి. కూటము నందు అనగా మాయయందున్నవాడు అక్షర పురుషుడు. క్షరపురుషుడు జీవుడు. మొత్తము మీద భగవద్గీతలో అక్షరపురుషుడనగా ఈశ్వరుడు పరబ్రహ్మ అని చెప్ప బడినది మరియు ఆ ఈశ్వరుడే అన్నిక్షేత్రములలో నుండు క్షేత్రజ్ఞుడను నేనే అని నిశ్చయించుట చెప్పబడినది. అన్ని క్షేత్రములందుండువాడు ఈశ్వరుడే కావున జీవేశ్వరైక్యము క్షేత్రము కూడా నేనే అని చెప్పబడుటచేత అక్షరతత్త్వమున కితరము ఏమియు లేదను బ్రహ్మైక్య సిద్ధాంతము భగవద్గీతలలో స్థాపింప బడినది. ఈ అర్థమును గ్రహించి దృశిమాత్ర బ్రహ్మ చైతన్య రూపుడైన ఏ హరిని స్వహృదయము నందు నిలిపి ధ్యానించి జ్ఞానులు తెలిసికొందురో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున అక్షర తత్త్వము అని చెప్పదగిన ఆ హరి ప్రకృతి సంపర్కము కలవాడై క్షేత్రజ్ఞతను, బహుత్వమును జలములందు చంద్రుని వలె పొందుట చెప్పబడుచున్నది.

శ్లో॥ క్షేత్రజ్ఞత్వం ప్రాప్య విభుః పంచముఖై ర్యో
భుంక్తే2జస్రం భోగ్యపదార్థాన్ ప్రకృతిస్థః।
క్షేత్రే క్షేత్రే 2ప్స్వింధువ దేకో బహుధా22స్తే
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 27

ప్రతిపదార్థము:- యః=ఏ, విభుః=ప్రభువు, ప్రకృతిస్థః=ప్రకృతిగతుడై, క్షేత్రజ్ఞత్వమ్ = క్షేత్రజ్ఞతను, ప్రాప్య=పొంది, పంచముఖైః=అయిదు ముఖములతో, భోగ్యపదార్థాన్=అనుభవింపదగిన పదార్థములను, అజస్రమ్= ఎల్లప్పుడు, భుఙ్క్తే= అనుభవించునో, క్షేత్రేక్షేత్రే=ప్రతిక్షేత్రము నందును, అప్సు=జలములలో, ఇందువత్= చంద్రునివలె, ఏకః=ఒకడు, బహుధా=అనేక విధములుగా, ఆస్తే=ఉండునో, తమ్=ఆ, సంసారధ్వాంతవినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:- ఏ ప్రభువు ప్రకృతిగతుడై క్షేత్రజ్ఞతను పొంది పంచ ముఖుడై భోగ్యపదార్థాలను అనుభవించుచు ఒక్కడైన చంద్రుడు జలములలో

పెక్కు ప్రతి బింబములను పొంది బహువిధములుగా నుండునో ఆ విధముగ ప్రతిక్షేత్రమున వేరువేరు రూపములనంది బహువిధములుగా ఉన్నాడో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- పిండాండములు జీవుల శరీరములు. బ్రహ్మాండ మీశ్వరుని శరీరము. శరీరము అనగా నశించునది. జీవుని శరీరములు ఆయువు తీరగానే నశించును. ఈశ్వరుని శరీరము సర్వభూతముల కర్మలు భోగానుభవముతో క్షీణించగా ప్రకృతి గుణములు సామ్యమును పొందునట్టి ప్రలయావస్థలో మాత్రమే నశించును. సర్వప్రాణి కర్మలు పరిపక్వములై భోగము కలిగించు స్థితికి రాగానే సృష్ట్యాదిలో ప్రకృతిస్థుడైన ఆ హరి గుణవైషమ్యమైన ప్రకృతి పరిణమించగా నేర్పడిన పిండాండములనబడు జీవశరీరములందును, వానికి సమష్టియైన బ్రహ్మాండ శరీరము నందును క్షేత్రజ్ఞత్వము నందును. ఆతనికి క్షేత్రగతములైన పంచేంద్రియములు ముఖములుగా నుండును.హర్యభిన్న శివుడు పంచముఖుడనుటలోని రహస్యమిదియే కావచ్చును. వానితో భోగ్యపదార్థములైన శబ్దస్పర్శరూపరస గంధములను (విషయము లను) అనుభవించుచు అవి అనుకూలములైనచో సుఖమును, ప్రతికూలములైనచో దుఃఖమును పొందుచుండును. పుణ్యకర్మల వలన అనుకూల భోగములను తద్వారా సుఖమును, పాపకర్మల వలన ప్రతికూల భోగములను తద్వారా దుఃఖమును అనుభవించుచు తద్భోగముతో పిండాండారంభక కర్మయైన ప్రారబ్ధకర్మయొక్క నాశము కలుగగా సంచిత కర్మయొక్క వాసనావిశేషముల వలన మరల కర్మల (జేయుచు) మరణించి అవి పరిపక్వములై మరొక శరీరారంభక ప్రారబ్ధకర్మగా మారగా మరొక శరీరము ధరించి మరణించు వరకు మరల నట్లే సుఖదుఃఖముల ననుభవించుచు మరణించి పూర్వకర్మవాసనా విశేషమున చేయబడిన కర్మలు పరిపక్వములై మరల మరొక శరీరము నారంభించు ప్రారబ్ధకర్మలు గా మారి అనగా పరిపక్వములై ఫలించిన దుఃఖభోగము లనుభవించుచు మరణించుచు, మరల పుట్టుచు ప్రారబ్ధకర్మ భోగము సమాప్తము కాగానే మరల మరణించుచు ప్రలయకాలము వరకుగాని, లేక ఆత్మజ్ఞాన పర్యంతముగాని సంసరించు చుండును. ఇది జీవులు సంసరించు ప్రకారము, ఇది ఒక శృంఖల. ఇది ఒక బంధము. ఇది నేను సర్వక్షేత్రజ్ఞుడనైన పరమేశ్వరుడనను జ్ఞానముతో

తొలగును. జలములందొక చంద్రుడు బహువిధములుగా ప్రతిబింబించునట్లు బహుక్షేత్రములందు ఒకే హరి వేరువేరుగా బహువిధములను బహురూపము లతో నుండునట్లు కనబడును. వాస్తవముగా హరికి బహుత్వము లేదు. పెక్కు విధములుగా నున్నను(కనబడినను) ఒక్కడే. అట్టి సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున సర్వం ఖల్విదం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి అనుశ్రుతి వాక్యముల తాత్పర్యముగా వ్యాసుడు చెప్పిన హర్యైక్యము చెప్పబడు చున్నది.

శ్లో॥ యుక్త్యా22లోడ్య వ్యాసవచాం స్యత్ర హి లభ్యః
క్షేత్రే క్షేత్రే జ్ఞాంతర విద్భిః పురుషాఖ్యః।
యో2హం సో2సౌ సో2స్మ్యహ మేవేతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 28

ప్రతిపదార్థము:-' వ్యాసవచాంసి=వ్యాసుని వాక్కులను, యుక్త్యా= యుక్తితో, ఆలోడ్య=బాగుగ విచారించి, జ్ఞాంతరవిద్భిః= 'జ్ఞ' అనబడు లోనున్నవాని నెఱుగువారి చేత, అత్ర= ఈ, క్షేత్రేక్షేత్రే=ప్రతిక్షేత్రమున, పురుషాఖ్యః=పురుష అనునామము కలవాడు, అహమ్=నేను, యః=ఎవడనో, లభ్యః=పొందదగినవాడు, అసౌ=ఇది, సః=వాడే, అహంఏవ=నేనే, సః=వాడు, అస్మి=అయియున్నాడను, ఇతి=అని, యమ్= ఎవనిని, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాంతవినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హరిమ్= హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- వ్యాసవాక్యములను బాగుగా యుక్తితో విచారించి లోని జ్ఞాత నెఱిగిన వారికి ఈ క్షేత్రము లన్నింట పురుషుడు అని పేరుగలవాడు లభింపదగిన వాడు నేను ఎవడనో ఇదివాడే వాడు నేనే అయియున్నాను అని ఏ హరిని వారు తెలిసికొనుచున్నారో, ఆ సంసారాంధకారనివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- బ్రహ్మ సూత్రములు, పురాణములు వ్యాసవాక్కులు వానిని బాగుగా విచారించిన తమలోనున్న జ్ఞాతనెఱిగినవారికి ఈ కనబడు

ప్రతి క్షేత్రమున పురుషుడు అను పేరుగల హరి తప్పక లభించును. బయట కనబడు వ్యష్టి సమష్టి క్షేత్రసముదాయము నాచే భిన్నముగా తెలియబడు చున్నను నాకన్న భిన్నము కాదు. ఏ హరి ఈ వ్యష్టి సమష్టి క్షేత్రముల సృజించినాడో ఆ హరిని నేనే. పైన చెప్పబడిన యదదస్తదహమ్ పదార్థములు పురుషరూపములు. భిన్నముగా కనబడు సర్వజడ భూతములు నశించునవి కావున క్షరపురుషుడు 'క్షరః సర్వాణి భూతాని' అని గీతావాక్యము యొక్క అర్థమిది. అట్లే కూటస్థుడు అక్షర పురుషుడు. కూటమనగా మాయ. దానిలో దానికి అధీనులైయున్న చేతనులు జీవులు అక్షర పురుషులు భగవద్గీత కూటస్థో2క్షర ఉచ్యతే అని చెప్పుచున్నది. ఈ క్షేత్రక్షేత్రజ్ఞోభయమున కతీతుడై క్షేత్రక్షేత్రజ్ఞోభయమును ఐయున్నవాడు ఉత్తమ పురుషుడు. వాడే పరమాత్మ అని ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః యో లోక త్రయమావిశ్య విభర్త్య వ్యాయ ఈశ్వరః అను గీతావాక్యము యొక్క అర్థమిది. తేనేదమ్ పూర్ణమ్ పురుషేణ సర్వమ్ (ఆ పురుషుని చేతనే ఇదంతయు నిండియున్నది) అని శ్రుతి చెప్పిన పురుషుడే ఉత్తమ పురుషుడే క్షేత్రమును సృజించి క్షేత్రమును ఆవేశించి సృష్టికాలమున 'తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్' (దానిని సృజించి దానిలో ప్రవేశించెను) అను శ్రుత్యనుసారము ప్రలయకాలమున తనలో లీనమొనరించి సృష్టిలయకాలములలోను నాకన్యమైనది లేదని నిరూపించు వాడు పురుషాఖ్యుడు. వాడు సృజించిన జడజగము పుసుషుడే. దానిలో క్షేత్రజ్ఞరూపులైన జీవులును పురుషుడే. ఈ క్షేత్రమును నేనే, క్షేత్రజ్ఞుడను కూడ నేనే. 'క్షేత్రజ్ఞమ్ చాపిమామ్ విద్ధి సర్వక్షేత్రేషు భారత' (సర్వక్షేత్రములలోని క్షేత్రజ్ఞుడను ఆ క్షేత్రములును నేనే) అను గీతావాక్యము యొక్క అర్థము ననుభవములోనికి తెచ్చుకొనువారు జ్ఞానులు. వారు జీవన్ముక్తులు. దేహావసానమున కైవల్యము నొందువారు వారే. వ్యాసవచనములన్నింటిని ఉపక్రమోప సంహారాది పుల్లింగములతో విచారించి పరోక్షజ్ఞానమునొంది తత్త్వమసియను గురువేదాంత వాక్యార్థమును విచారించి పురుషాఖ్యుడైన ఏ హరిని స్వాత్మ రూపముగా తెలిసినవారు అనగా(పరోక్షజ్ఞానము తొలుత పొంది) పిదప ఆ అపరోక్షసాక్షాత్కృతు నొనరించుకొందురో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకము సర్వక్షేత్రములలోని(క్షేత్ర)జ్ఞులనొకటిగా

జేసి చూచువారు పునరావృత్తి రహిత మోక్షము నందెదరని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏకీకృత్యానేక శరీరస్థ మిమం జ్ఞం
యం విజ్ఞాయేహైవ స ఏవా22శు భవన్తి
యస్మిన్ లీనా నేహ పున ర్జన్మ లభంతే
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 29

ప్రతిపదార్థము:- అనేక శరీరస్థమ్=అనేక శరీర క్షేత్రములందున్న, ఇమమ్= ఈ, జ్ఞమ్= జ్ఞాతను, ఏకీకృత్య=ఒకటిగాజేసి, విజ్ఞాయ= (స్వానుభవపూర్వకముగా) బాగుగా తెలిసికొని, ఇహఏవ=ఈ లోకమునందే (ఈశరీరముండగానే శరీరము లోనే), ఆశు= శీఘ్రముగా, స ఏవ= వాడుగానే (ఆ విష్ణువే), భవంతి=అగుదురు, యస్మిన్=ఎవనియందు, లీనాః= లీనులైన వారు, ఇహ= ఈలోకమున, పునః= మరల, జన్మ=జన్మను, న లభంతే= పొందరో, తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హరిమ్= హరిని, ఈడే= స్తుతించెదను.

**తాత్పర్యము:-** సర్వక్షేత్రములందు వేరువేరుగా కనబడుచున్నవాడొకే జ్ఞాతయని వేర్వు వేరు క్షేత్రజ్ఞుల నొకటిగా చేసి ఎవనిని బాగుగా (స్వానుభవ పూర్వకముగా) తెలిసికొన్నవారు, మొదట జీవన్ముక్తులై దేహావసానమున పరమాత్మ యందు లీనులై కైవల్యమునొంది మరల పునర్జన్మనొందరో ఆ సంసారంధకార నివారకుడైన హరిని స్తుతించెద ు.

వివరణము:- ప్రతిక్షేత్రమున జ్ఞాత ఉన్నాడని స్వక్షేత్రమున జ్ఞాత యొకడున్నాడని తెలిసికొనువారందరకు తెలియును.తన శరీర (క్షేత్రము)న జ్ఞాత స్వానుభవ సిద్ధుడు. ఇతర (శరీర) క్షేత్రములందలి జ్ఞాత అనుమేయుడుగా నుండును కానీ బాగుగా విచారించినచో నాలోని జ్ఞాతకు ఇతరులలోని జ్ఞాతకు భేదమేమియని ఎంత విచారించినను భేదము మాత్రము తెలియరాదు. అనగా జ్ఞాతృభేదమును అనుమానించుటకు కూడా తగిన హేతువేదియు కనబడదు. ఇట్లు విచారించుటయే సర్వశరీరములోని జ్ఞాత(ల)నేకము చేయుట. ఇట్లు ఏకీకరణము చేసిన వెంటనే సర్వక్షేత్రజ్ఞాతయైన ఈశ్వరుడనే నేను అను జ్ఞానము కలుగును. ఈ జ్ఞానము శరీరముండగనే ఈ లోకముననే కలుగును.

ఈ జ్ఞానము కలవారిని జీవన్ముక్తులు అందురు. ప్రారబ్ధకర్మము భోగానుభవమున క్షీణమైన పిదప దేహావసానము కలిగిన పిదప కైవల్యమును పొందెదరు. జీవన్ముక్తులు మరణించిన పిదప వారి జీవులు ఏలోక ప్రయాణము చేయరు. పునర్జన్మనొందరు. న తస్య ప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమ వలీయం తే అను శ్రుత్యనుసారము వారి ప్రాణేంద్రియ భూతములు ఇక్కడనే అనగా ఈ పంచభూతములలో లీనమగును. ఈ విధముగా వారి క్షేత్రము సమష్టిక్షేత్రమున లీనముకాగా వారి జీవాత్మలు జీవ అని చెప్పుటకు కావలసిన జీవము లేనందున ఆత్మలో అనగా పరమాత్మలో లీనమగుదురు. ఆత్మ విషయమున లీనమగుట అనగా ఏకీభావమే. సాధారణముగా జీవులు మరణించుట యనగా ప్రాణేంద్రియములు స్థూలదేహములో నుండి బయటకు పోవుట. అట్లు బయటకు పోయినప్పుడు స్థూలదేహము నిశ్చేతనమై పడిపోవును. అప్పుడా స్థూలదేహము శవము అనబడును. అది త్వరగా కుళ్లి దుర్వాసన కలదిగానై (చెడి) పోవును. బయటకు పోయిన సూక్ష్మదేహ రూపములైన ప్రాణేంద్రియములు మరల నొక స్థూల దేహమును స్వీకరించుట పునర్జన్మ అనబడును. స్థూలదేహములో నుండి సూక్ష్మదేహములు రాకపోకలు చేయుటకు మూలమైనది వారిలోని కారణదేహము. ఇదియే అజ్ఞానము. అజ్ఞానము వలన పూర్వదేహమున జీవునిచే చేయబడిన పుణ్యాపాప కర్మలు దేహాంతరమున సుఖదుఃఖానుభవములకు కారణములు. ఇంతకు ముందు చెప్పబడిన జీవన్ముక్తులు అజ్ఞానము తొలగినవారు. అజ్ఞానము తొలగినచో దానిలో నుండి ఏర్పడిన స్థూల సూక్ష్మదేహములేల వెంటనే నశింపలేదు అను ప్రశ్నము కలుగును. వారి శరీరములు దగ్ధపట సదృశములు. కాలిన వస్త్రములు వస్త్రముల వలె కనబడినను కట్టుకొనుటకు పనికి రానట్లు వీరి శరీరములు శరీరములవలె కనబడినను పునర్జన్మకు కావలనసిన అజ్ఞానకర్మ సంస్కారములు లేనివి కావున జీవన్ముక్తులకు పునర్జన్మము లేదు. ఇట్లు పునర్జన్మము లేకుండ చేసికొనుటకు జ్ఞానులు తమ క్షేత్రములలోని జ్ఞాతలను సర్వ క్షేత్రగతులై జ్ఞాతల నేకీభవింపజేసి తమ క్షేత్రజ్ఞుని పరమాత్మయైన ఏ హరిగా తెలిసికొందురో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున మధుబ్రాహ్మణవాక్యానుసారము ద్వంద్వైకత్వము ను సంపాదించి శక్రోపాసన మొనరించి దాని ప్రభావముచేత

ఈ కనబడునదంత పరమాత్మయే, ఆ పరమాత్మను నేను అను జ్ఞానము కలుగుట చెప్పబడుచున్నది.

శ్లో॥ ద్వంద్వైకత్వం యచ్చ మధుబ్రాహ్మణవాక్యైః
కృత్వా శక్రోపాసన మాసాద్య విభూత్యా।
యోఽసౌ సోఽహం సోఽస్మ్యహ మేవేతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 30

ప్రతిపదార్థము:- మధుబ్రాహణవాక్యైః=మధుబ్రాహ్మణవాక్యములతో, యచ్చ=ఏ, ద్వంద్వైకత్వమ్=ద్వంద్వములకు ఐక్యమును (కలదో), కృత్వా=చేసి, శక్రో పాసనమ్=శక్రోపాసనమును, ఆసాద్య=పొంది, విభూత్యా =ప్రభావముతో, యోఽసౌ=ఏయీ సర్వాత్మకలదో, సః=వాడు, అహమ్=నేనే, అస్మి= అయితి నని, సః=వాడు, అహమేవ=నేనేఅని, ఇతి=ఇట్లని, యమ్=ఏహరిని, విదుః= తెలిసికొందురో, తమ్= ఆ, సంసారధ్వాంతవినాశమ్= సంసారాంధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే =స్తుతించెదను.

తాత్పర్యము:- మధుబ్రాహ్మణ వాక్యములచే చెప్పబడిన ద్వంద్వమున కేకత్వము నొనరించి, శక్రోపాసన మొనరించి, దాని ప్రభావముతో ఏ యీ సర్వాత్మ కలదో వాడు నేనేయై యున్నాడని యే హరిని తెలిసికొందురో ఆ సంసారాంధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- బృహదారణ్యక ద్వితీయాధ్యాయ పంచమ బ్రాహ్మణము మధు బ్రాహ్మణమని పిలువబడును.అందీ పృథివ్యాదు లితర భూతములకు మధువు అనీ, ఇతర భూతములకు పృథివ్యాదులు మధువు అని చెప్పబడుట చే, ఆ బ్రాహ్మణమునకు మధు బ్రాహ్మణమనిపేరు వచ్చినది. దానియందు పరస్పరోపకారకములగుటచే పరస్పర మధుత్వమునందిన ద్వంద్వములకు మధువున ఏకత్వము చెప్పబడినది. అట్లే విశేషరూపములైన కార్యకారణాదులకు ద్వంద్వముల సామాన్యమైన ఆత్మ అనగా బ్రహ్మయందు ఏకత్వమును చేయవలయును. ఈ మధు విద్య ఇంద్రోపాసన చేతను పొందుటకు వీలగును. ఇంద్రుడెప్పుడు దీనిని రక్షించుచుండును. హిరణ్యా గర్భాది పరంపరగా ఈ మధు విద్య దధ్యఙ్ మహర్షికి ప్రాప్తమైనది. ఆతనిని విద్య నుపదేశించుమని

దేవవైద్యులైన అశ్వనీ దేవతలు ప్రార్థించిరి. కానీ దధ్యఙ్ మహర్షి, అశ్వనీ దేవతలతో ఈ విద్యను ఇంద్రుడు రక్షించుచున్నాడు. నేను మీకు చెప్పినచో నా తలను నరికివేయునని చెప్పెను. అప్పుడా అశ్వనీ దేవతలు 'ఓయీ! ఇప్పుడే మేము నీ తలను తీసివేసి, నీకు గుఱ్ఱపు తల నమర్చెదము. నీవు మాకు మధువిద్య నుపదేశింపుము' అపుడు ఇంద్రుడు నీ (గుఱ్ఱపు) తలను తెగనఱకును. మేము ఇంతకు ముందు దాచి యుంచిన, నీ తలను తిరిగి నీ కతికించెదము, అని చెప్పి ఆతని నొప్పించి ఈ మధు విద్యను పొందినారు. అశ్వినీ దేవతలు ఇంద్రుని లోకమున వైద్యులు కావున, ఆయన ఉపాసకులు ఆ ఉపాసన చేతనే వారికా గుఱ్ఱపు తలను అమర్చు ఉపాయము తోచినది. దాని చేతనే వారికి తలల దీసి, తలల నమర్చు విభూతి కల్గినది. అట్లే మధు విద్య అని ప్రసిద్ధి నొందిన ఈ బ్రహ్మవిద్యను పరదేవతోపాసన నొనరించి తదనుగ్రహమున నెవరైనను పొందవచ్చు. ఎందరో అట్లు పొంది ఏ హరిని ఆత్మ రూపమున సాక్షాత్కరించికొనినారో అట్టి సంసారనాశకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ఆత్మైక్యోపాసనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ యోఽయం దేహే చేష్టయితాఽంతఃకరణస్థ**
**స్సూర్యే చాసౌ తాపయితా సోఽస్మ్యహ మేవ।**
**ఇత్యాత్మైక్యోపాసనయా యం విదు రీశం**
**తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 31**

ప్రతిపదార్థము:- యః=ఏ, అయమ్=వీడు, అంతఃకరణస్థః= అంతఃకరణమునం దున్నవాడై, దేహే=దేహమున, చేష్టయితా=చేష్టలు కలిగించు చున్నవాడో, అసౌ=ఇతడే, సూర్యేచ=సూర్యునందును, తాపయితా= తపింప జేయుచున్నావాడో, సః=వాడు, అహమేవ=నేనే, అస్మి=అయియున్నాను, ఇతి= అని, ఆత్మైక్యోపాసనయా= ఆత్మయొక్క ఐక్యము యొక్క ఉపాసనచేత, యమ్=ఏ, ఈశమ్=ఈశ్వరుని, విదుః=తెలిసికొందురో, తమ్= ఆ, సంసార ధ్వాన్తవినాశమ్= సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- అంతఃకరణము నందుండు వాడై దేహమున చేష్టలను కలిగించుచున్నాడో, సూర్యుని యందున్న వాడెవడో, తాపమును కలిగించు వాడెవడో, వాడు నేనే అయియున్నానని ఆత్మయొక్క ఐక్యము నుపాసించి ఏ హరిని తెలిసికొను చున్నాడో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- అంతఃకరణము నందుండి దేహమున చేష్టల కల్గించుట జీవుని పనియని, తపింపజేయుట సూర్యుని పని అని మన మనుకొను చున్నాము. కాని ఈ జీవుడు ఆ సూర్యుడును ఆత్మయే అని తెలిసికొనవలెను. ఇంకను మనలో కొందరు దేహమున చేష్టలకలిగించు అంతఃకరణస్థ జీవాత్మవేఱని, సూర్యునందుండి తపింపజేయు హిరణ్యగర్భుడు వేరని భావించుచున్నారు. కాని ఎవడు అంతఃకరణస్థ జీవుడై దేహమున చేష్టల కలిగించుచున్నవాడో, సూర్యునం దుండి హిరణ్యగర్భుడై తపింపజేయు చున్నాడో వాడు ఒకడే. వాడు ఆత్మ, వాడు ఒక ఆత్మయే అనగా నేనే. ఇట్లు నేనే జీవరూపమున అంతఃకరణము నందుండి దేహమున చేష్టల కలిగించు చున్నాను. నేనే హిరణ్యగర్భ రూపమున సూర్యునిలో నుండి తాపము కలిగించుచున్నానని నిరంతరము భావించుట ఆత్మైక్యోపాసనము. ఒకప్పుడు దేహమున చేష్టల కలిగించునది నేనేనా అనియు సందేహము కలుగుచుండగా సూర్యునిలో హిరణ్య గర్భరూపమున నుండి లోకమునంతను తపింప జేయుచున్నానను అనుభవమట్లుంచి భావన కలుగుటయు మనకు కల్గుట దుస్సాధ్య మనిపించును. కాని శాస్త్రము అంతఃకరణస్థ జీవ రూపము సూర్యబింబస్థ హిరణ్యగర్భరూపమేగాక వాయువులో నుండి కదిలించువాడు, చంద్రునిలో నుండి ఓషధుల పోషించువాడు ఇత్యాదిగా సర్వకర్మల లోకమున నిర్వహించున దాత్మయే అని చెప్పుచున్నది. దానిని విశ్వసించి ఈ ప్రపంచము నంతట నేనే ఉన్నాను. ఈశ్వరుడనై జగత్సృష్ట్యాది సమస్త కర్మల నేనే చేయుచున్నానని భావింపవలెను. ఇట్లు భావించుట ఆత్మైక్యోపాసనము. నేనే కర్మల చేయుటలేదు. సర్వజీవాంతః కరణములలో నుండి జరుగుచున్న అన్ని పనులకు చరాచరములకు సాక్షిగా నేనే అని భావించుటయు ఆత్మైక్యోపాసనమే. ఆత్మైకత్వ నిశ్చయజ్ఞానము ఆత్మైకత్వాను భవము కలుగునంతవఱకు నీ యుపాసనము నాచరింపవలసి యుండును. ఆత్మైకత్వానుభవము కలిగిన

నిక యుపాసన మావశ్యకము కాదు. మనలో నున్న నేను మనుష్యుడను ఇత్యాద్యనుభవములుండగా నేను మనుష్యుడను ఇత్యాదిగా మనము భావించుట లేదుగదా. 'తత్త్వమసి' అను గురూపదేశమైన వెంటనే నేనే బ్రహ్మను సర్వము నేనే, ఇత్యాద్యనుభవ ముత్తమాధికారికి కలుగను. ఇట్లు ఉత్తమాధికారములేని మధ్యమాధికారులనుద్దేశించి ఇట్లు ఆత్మైకత్వబోధక శాస్త్రోపదేశానుసారము ఆత్మైకత్వమును అనగా నా కంటె భిన్నముగా కనిపించున దంతయు నేనే అని అన్నికర్మల నాచరించునది నేనే, ఏ కర్మల చేయక సర్వచరాచరములలో సాక్షిగా నున్నదియు నేనే అని ఉపాసించుటవలన ఏ హరియొక్క యథార్థ జ్ఞానము అనగా హరిని (పరమాత్మను) నేనే అను అనుభవము కలుగునో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున తానే సర్వ సాక్షియయి యుండగా ఆ అనుభవమును పొందక బుద్ధిని తెలిసికొను జ్ఞాతను బుద్ధితో తెలిసికొనుట అసాధ్యము అని చెప్పబడుచున్నది.

శ్లో॥ విజ్ఞానాంశో యస్య సత శ్శక్త్యధిరూఢో
బుద్ధి ర్బుధ్యత్యత్ర బహి ర్బోధ్య పదార్థాన్।
నైవాంత స్స్థం బుధ్యతి యం బోధయితారం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 32

ప్రతిపదార్థము:- సతః=సద్రూపుడైన, యస్య=ఎవని యొక్క, శక్త్యః= శక్తితో, అధిరూఢః=అధిరూఢమైన, విజ్ఞానాంశః=విజ్ఞానాంశమైన, బుద్ధిః=బుద్ధి, అత్ర=ఇచట, బహిః=వెలుపలను, బోధ్యపదార్థాన్=తెలియదగిన పదార్థములను, బుధ్యతి= తెలిసికొనునో, బోధయితారమ్=తెలుపునట్టి, అంతఃస్థమ్=లోపల నున్నట్టి, యమ్=ఎవనిని, న బుధ్యతి ఏవ =ఎఱుగనే యెఱగడో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే = స్తుతించెదను.

తాత్పర్యము:- హరిసద్రూపుడు. ఆయన శక్తి అధిరూఢమైన విజ్ఞానాంశమే. ప్రతి జీవపదార్థమున బుద్ధి అని పేర్కొనబడుచున్నది. అది బాహ్యపదార్థముల నెఱుగునేగాని తనలో నుండి తన నెఱుగు బోధయితను

అనగా జ్ఞాత నెఱుగుట అసాధ్యము. ఈ బుద్ధి ఎవని విజ్ఞానాంశమో ఆ సంసారాన్ధకారనివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- సత్యం జ్ఞాన మనంతమ్ బ్రహ్మ విజ్ఞాన మానందమ్ బ్రహ్మ అను శ్రుతి వాక్యముననుసరించి హరిసద్రూపుడు విజ్ఞాన స్వరూపుడు. మాయ త్రిగుణాత్మకము. త్రిగుణములు సత్త్వరజస్తమస్సులు. మాయలో శుద్ధ సత్వము ప్రధానము. మాయలో విజ్ఞాన స్వరూప హరి పరబ్రహ్మ ప్రతిబింబించినప్పుడు సత్వగుణ ప్రధానపరిణామముగా మహత్తు ఏర్పడును. ఒక విధముగా పరమేశ్వరునికి ప్రకృతిపరిణామమైన ఈ మహత్తు బుద్ధి స్థానీయమగును. అది బుద్ధి సమష్టియైనను దానికి బుద్ధి వ్యవహారములేదు. ఆ సమష్టియైన విజ్ఞానాంశశక్తిచే అధిరూఢమై వ్యష్టి బుద్ధి ఏర్పడును. అది జ్ఞానేంద్రియములను ప్రేరేపించి దాని ద్వారమున ఉపస్థాపింప బడిన బాహ్య పదార్థములను గ్రహించును. బుద్ధి జడము. మాయ జడము. దానిలోని త్రిగుణములు జడములు. మొదట జడమైన బుద్ధియందు విజ్ఞాన స్వరూపుడైన హరి పరబ్రహ్మ ప్రకాశము పడనిదే బుద్ధియే ప్రకాశింపదు. అది మిగిలిన పదార్థములను తెలుసుకొను నవకాశమే లేదు. బుద్ధి తనకు బాహ్యముగా నున్న పదార్థములను గ్రహించగలదేగాని తనలోనున్న ఆత్మను తనకు ప్రకాశము నిచ్చుదానిని ప్రకాశింప జేయలేదు. దీపము తాను ప్రకాశించుచు ఇతరుల ప్రకాశింపజేయునట్లు ఆత్మ తాను ప్రకాశించుచు బుద్ధిని ప్రకాశింప జేసి తద్వారా ఇంద్రియముల ప్రకాశింపజేసి తద్వారా బాహ్య పదార్థముల ప్రకాశింపజేయును. ప్రకాశింపజేయుట అనగా వానిపై వెలుగును విరజిమ్మట అట్లే జ్ఞాన స్వరూపము అయిన ఆత్మ తన తెలివిని ఇతరులను ప్రకాశింపజేసి వానిని వెలుగింపజేయును గాని వానిని గ్రహించదు. దీపము జడము కావున తాను వేనిని స్వయముగా తెలిసికొనలేదు. దానినొక చేతనుడు మాత్రమే గ్రహించును. దాని వెలుగు ప్రసరించిన వానిని కూడ చేతనుడే గ్రహించును. బుద్ధి స్వయముగా వెలుగు. దీపము కాదు. కాని చేతనుని తెలివి తనపై పడగానే తనదే ఆ తెలివి అని పించునట్లుగా ఇతరుల ప్రకాశింప జేయునుగాని తనకు తెలివిని ప్రసాదించు తనలోని ఆత్మను తెలిసికొనలేదు. 'విజ్ఞాతార మరే కేన విజానీయాత్' (విజ్ఞాతను దేనితో తెలిసికొనవచ్చును) అను శ్రుతియొక్క అర్థమీ శ్లోకములోని మూడవపాద మనువదించుచున్నది. బుద్ధి

తన వ్యాపారమును విరమింపజేసి కొన్నప్పుడును ఆత్మ వెలుగుచునే యుండును. 'అహమ్ బ్రహ్మాస్మి' అను చరమజ్ఞానమునందును తన బ్రహ్మత్వము పైనున్న ఆవరణము మాత్రమే తొలుగును. దానిని దృష్టిలో నుంచుకొని బుద్ధి గ్రాహ్యామాత్మ అని చెప్పుటయున్నది. కాని బుద్ధి ఘటాదులను గ్రహించినపుడు తత్ఫలముగా ఘటమహం జానామి అను అనువ్యవసాయము కలిగినట్లు 'అహమ్ బ్రహ్మాస్మి' అను జ్ఞానము కలిగిన పిమ్మట నేను బ్రహ్మను తెలుసుకొనుచున్నాను అను ఫలవ్యాప్తి ఉండదు. తెలిసికొనువాడే బ్రహ్మ అని తెలిసికొనుట ఇందున్నది. కాని తెలియబడు బ్రహ్మ మరొకటిలేదు. తెలియబడున దంతయు మిథ్యయే కావున బుద్ధి బోధయితను గ్రహించదు అని ఈ శ్లోకమున చెప్పబడినది. ఏ హరిని బుద్ధి తెలిసికొనలేదో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను

అవతారిక:- ఈ శ్లోకమున ఆత్మయే అన్నింటిని గ్రహించునని చెప్పబడు చున్నది.

శ్లో॥ కో2యం దేహే దేవ ఇతీత్థం సువిచార్య
జ్ఞాతా శ్రోతా 22 నందయితా చైవ హి దేవః।
ఇత్యాలోచ్య జ్ఞాంశ ఇహాస్మీతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 33

ప్రతిపదార్థం:-దేహే=దేహమున, అయమ్=ఈ, దేవః=ప్రకాశించువాడు, కః=ఎవడు, ఇతి=అని, ఇత్థమ్= ఈవిధముగా, సువిచార్య=బాగుగా విచారించి, దేవః+ఏవ=ప్రకాశించు ఈదేవుడే, జ్ఞాతా=జ్ఞాత, శ్రోతా=వినువాడు, ఆనన్దయితా చ=సంతోషపెట్టువాడును, హి=కదా, ఇతి=అని, ఆలోచ్య=ఆలోచించి, ఇహ= ఇచట, జ్ఞాంశః=తెలుసుకొనువాని అంశమునై, అస్మి=ఉన్నాను, ఇతి=అని, యమ్=ఎవనిని, విదుః=తెలుసుకొందురో, తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- ఈ దేహమున ఈ తెలిసికొనువాడు ఎవడు అని బాగుగా విచారించి ఈ ప్రకాశించు దేవుడే జ్ఞాత, శ్రోత మరియు సంతోష

పెట్టువాడు అని ఆలోచించి, 'జ్ఞ' అను పరమాత్మ (యొక్క అంశము) నేనేను అని ఏ హరిని తెలిసికొందురో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- బుద్ధి ఆత్మను ప్రకాశింపజేయజాలదు. అది స్వయముగ జడము కావున జ్ఞాత కాజాలదని పై శ్లోకమున చెప్పబడినది. మరియు నీ ప్రకాశించు (దేవ) జ్ఞాత ఎవడు, అని విచారింపవలసియున్నది. ఆత్మయే జ్ఞాత, శ్రోత, సంతోష పెట్టువాడు అని చెప్పవలసియున్నది. శరీరమున గదా చెవి యున్నది. మఱి శరీరమే శ్రోత అని ఏల చెప్పరాదు. శరీరమున చెవి ఉన్నను శరీరము శబ్దమును గ్రహించదు అని శవము నందు చెవియున్నను గ్రహించుట లేకపోవుట వలన నిశ్చయించుకొన వచ్చును. అట్లే సంతోష పెట్టునదియు ఆత్మయే. మఱి ఈ ఆత్మ ఎవరు? సర్వ క్షేత్రములందుండి జ్ఞేయములలోని 'జ్ఞ' అను అంశమే జ్ఞేయ శరీరమునందును ఉన్నది. కావున 'జ్ఞ'అంశము అని చెప్పబడినది. జ్ఞేయము నందుండుటచే అంతఃకరణ గతుడగుటచే అంశము అని చెప్పబడినాడు. ఇంతేకాని వాస్తవముగా ఆత్మ అంశము అని ఆ శబ్దము యొక్క అర్థము కాదు. పైగా అధిష్టానమనగా సర్వవ్యాపకముగనే అది యున్నది. ఆ సర్వవ్యాపకచైతన్యమునకు అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమునకు ఘటాకాశ మఠాకాశములకు వలెను భేదము చెప్పకూడదు. అయినను ఘటాకాశ వ్యవహారము లోకమున నున్నది. ఘటాకాశము అంశము అని అంగీకరించినను పరిచ్ఛిన్నముగా నున్నను దాని లోని ఆకాశ ధర్మములకే మాత్రము హాని కలుగనట్లు 'జ్ఞ' యొక్క సర్వజ్ఞాన శక్తితో భేద మేమియు కలుగదు. నేను పరిచ్ఛిన్నుడను అను భ్రాంతి తొలుగగనే వ్యవహారము ననుసరించి యిట మరొక విధముగా జ్ఞాంశ శబ్దమునకు జ్ఞులు అంశములుగా గలది అని అర్థము చెప్పి జ్ఞాంశమని చెప్పబడినను ఇది 'జ్ఞ' యే అనగా హరియే, అని ఏ హరిని తాముగా నెఱుగుదురో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ఆత్మవలనే సర్వము జీవించుచున్నదని చెప్పబడుచున్నది.

శ్లో॥ కోహ్యేవాన్యా దాత్మని న స్యాదయ మేష
హ్యేవానందః ప్రాణితి చాపానితి చేతి।

ఇత్యస్తిత్వం వక్త్యుపపత్త్యా శ్రుతి రేషా
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 34

ప్రతిపదార్థము:- అయమ్=వీడు, నస్యాత్=లేనిచో, కః+హి+ఏవ= ఎవడు, అన్యాత్= జీవించును, ఏషహిఏవ= వీడే, ఆనందః=ఆనందము, ప్రాణితిచ= బ్రతుకుచున్నాడు కూడ, అపానితిచ =అపానవ్యాపారము జేయు చున్నాడు, ఈ విధముగా, ఏషా=ఈ, శ్రుతిః=వేద(మాత), ఉపపత్త్యా=యుక్తి తో, (యస్మిన్=ఏ) ఆత్మని= ఆత్మయందు, అస్తిత్వమ్=ఉనికిని, వక్తి=చెప్పు చున్నదో, తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్=సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- (ఈ ఆత్మలేనిచో ఎవడు జీవించును? ఆత్మయే ఆనందము, వీడు బ్రతుకుచున్నాడు) అను అర్థమిచ్చు "కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందో నస్యాత్, ఏషహ్యేవానంద యాతి" ఇత్యాదిశ్రుతి వాక్యములు ఏ ఆత్మ యొుక్క అస్తిత్వము నుపపత్తి పూర్వకముగా నిరూపించుచున్నవో ఆ ఆత్మయైన సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఏదేని ఒక అంగమో, ఒక అంశమో లేకపోయినను ఆ అంగియొుక్క, లేక ఆ అంశియొుక్క ఉనికికి అభ్యంతరములేదు. కానీ స్వరూపమే లేనిచో దానికి ఉనికి ఉండదు. దీపమును కనగా అగ్నికి ప్రకాశోష్ణత్వ ములు స్వరూపములు. అవిలేక అగ్ని ఉండదు. అగ్నిలోని అంశమైన ఒక మిణుగురు లేకపోయినను అగ్ని ఉనికికి అభ్యంతర ముండనక్కరలేదు. ఆత్మలేక ఏ వస్తువును ఉండదు ఎందుకు? ఉనికియే ఆత్మ స్వరూపమగుట చేత ఒక వస్తువున్నదనగా దాని స్వరూపమైన ఉనికి ఆత్మ కావున ఆ వస్తువు న్నదని చెప్పబడును. ఆత్మలేక ఏదియును ఉండదు. ఏల? ఉండుటయే ఆత్మ స్వరూపము. కావుననే పై శ్రుతి వాక్యములు ఈ ఉపపత్తిని చూపించి ఆత్మేతరమునకు ఉనికి లేదని అందువలన ఆత్మేతరమే లేదని ఆత్మేతర మనిపించునదంతయు ఆత్మయందే కొంత కాలముండి నశించుచున్నదని ఆ ఇతరము నిజముగా నున్నదగుచో నెప్పుడు ఉండవలె, లేని దగుచో నెప్పుడు లేకుండవలె. ఉండుట, లేకుండుట అనునవి విరుద్ధ ధర్మములగుటచే నొకచోట

నుండునవి కావు. ఆత్మేతరమంతయు భ్రాంతి దర్శనమే అని, సత్యమొక ఆత్మయేయని నిరూపించు శ్రుతి ఉపపత్తిచేత నే హరి రూపాత్మయందే అస్తిత్వమును చెప్పుచున్నది. మిగిలిన ఆత్మేతరముగా భ్రాంతమైన వస్తువుల యునికి ఆత్మాధీనమైన ఉనికియే.కావున ఏ ఆత్మయొక్క ఉనికి సత్యత్వమును నిరూపించుచున్నదో ఆ సంసారాంధనివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ప్రాణమాత్మకాదు. జ్ఞప్తి మాత్రమే ఆత్మ అని చెప్పబడుచున్నది.

శ్లో॥ ప్రాణోవా2హం వాక్శ్రవణాదీని మనో వా
బుద్ధిర్వా2హం వ్యస్త ఉతాథాపి సమస్తః।
ఇత్యాలోచ్య జ్ఞప్తి రిహాస్మీతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 35

ప్రతిపదార్థము:- అహమ్=నేను, ప్రాణఃవా=ప్రాణమునా, వా=లేక, అహం=నేను, వాక్శ్రవణాదీని=వాక్శ్రవణాదులనా, మనోవా=లేక మనస్సునా? అథాపి= లేక, బుద్ధిః=బుద్దినా?, వా=లేక, వ్యస్తః=వ్యష్టినా?, ఉత=లేక, సమస్తః= సమష్టినా?, ఇతి=అని, ఆలోచ్య=ఆలోచించి, ఇహ= ఇచ్చట, అహమ్=నేను, జ్ఞప్తిః=జ్ఞప్తినై, అస్మి=ఉన్నాను, ఇతి=అని, యమ్=ఎవనిని, విదుః= తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- నేను ప్రాణమునా, వాక్శ్రవణాదీంద్రియ స్వరూపుడనా, మనస్సునా,బుద్దినా, వ్యష్టినా, సమష్టినా అని విచారించి నేను జ్ఞప్తి మాత్రుడను అని ఏ హరిని తెలిసికొనుచున్నారో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ప్రతివ్యక్తి తానెవరో అని విచారించి తెలిసికొనుట ఆవశ్యకము. నేను మనుష్యుడను, నేను యువకుడును ఇత్యాదిగా ఆత్మను(తనను) తెలుసు కొనుచున్నాడు కదా! తన విషయమున నేనెవడను అను సంశయముండినగదా విచారించుట. సంశయము లేనప్పుడు విచారించుట ఎందుకు? అను ప్రశ్న కలుగును. నిద్రలో తానున్నాననుటలో

సందేహములేదు. కానీ జాగ్రదవస్థలో మనుష్యుడ ననుకొనువాడు నిద్రలో మనుష్యుడనను కొనుటలేదు. నేను మనుష్యుడనుకొనుట జాగ్రదవస్థలో మాత్రమే, వ్యవహారికవముగ మాత్రమే సత్యము. కావున మనుష్యత్వము తనయందు భ్రాంతిచే జాగ్రదవస్థలో తోచుచున్నదే. అది వాస్తవమైనచో నిద్రలో సైతము అనుభవ ముండవలె. తన ఉనికిని ఎట్టి పరిస్థితిలో సందేహించుట లేదు. కావున ఉనికి ఒక్కటే వాస్తవమైన తన స్వరూపము. స్వప్నమున తనకు రెక్కలు వచ్చి ఆకాశమున తిరుగుచు పక్షిని అనుకొనుట జాగ్రదవస్థలో భ్రాంతి అని ఒప్పుకొను చున్నట్లే. నిద్రలో లేని మనుష్యత్వమును భ్రాంతియే. కావున ఆత్మ విచారము ఆవశ్యకము. తానెవరని విచారించుటలో మనకు శ్రుతి బాగుగా సహకరించుచున్నది. సత్యం జ్ఞాన మనంతమ్ బ్రహ్మ విజ్ఞాన మానందం బ్రహ్మ, తత్త్వమసి ఇత్యాది వాక్యములు జ్ఞానమే బ్రహ్మ స్వరూపము. ఆ బ్రహ్మమే నీవు అని చెప్పుచున్నవి. తనకు జ్ఞానమున్నదా అను సందేహము కూడ నెవనికి లేదు. కావున శ్రుతి చెప్పిన ఈ వాక్యము స్వానుభవమునకు దగ్గఱగానున్నది. ఇతర వస్తువులను నా యింద్రియములు గ్రహించి అనగా వృత్తిజ్ఞానముగా మార్చి నాకు అందించుచున్నవి కావున ఆ వస్తువులకు సైతము జ్ఞానమే స్వరూపము అని తెలియుచున్నది. సత్యవస్త్వనుభవములోను, మిథ్యా వస్త్వనుభవములోను జ్ఞానమొక్కటే. తరువాత ఉనికిని కోల్పోయినప్పుడు దానిని మిథ్య అందుము. అంతియే భేదముకాని అనుభవ స్వరూపమున నే భేదమును లేదు. అట్లే తనకన్నా భిన్న వస్తువున్నప్పుడు అది తన ఉనికికి భంగము కలిగించునేమోయని భయము కలుగును. ఈ విషయమునే ద్వితీయాద్వై భయమ్ భవతి అని శ్రుతి చెప్పుచున్నది. ఒకడుగా నుండుటయే ఆనందమని నిద్రవలన స్పష్టమగు చున్నది. స్వప్న జాగ్రదవస్థలలో భిన్న దర్శనమున దుఃఖమేర్పడుట సర్వానుభవ సిద్ధము. తాను ఆనందస్వరూపుడ నని నిద్రలో గ్రహించుట సులభము, కాని నిద్ర కూడా కొన్ని గంటలు మాత్రమే ఉండి శాశ్వతముగా ఉండలేకపోవుటచే శాశ్వతానందము కాదు. సర్వము నా స్వరూపమే, నా కన్న భిన్న మేదియు లేదను శాస్త్రీయవేదప్రతిపాదిత తత్త్వమును తెలిసికొనవలెను. అట్లు తెలిసికొన్నచో తన స్వరూపము, ఉనికి, జ్ఞప్తి, ఆనందము అని తెలియును. ఈ మూడింటికిని వాస్తవముగా భేదము లేదు. ఉనికి జ్ఞప్తిగా తెలివిగానే ఉన్నది. తెలివి ఆనందముగానే ఉన్నది. కావున జ్ఞప్తి

ఉన్నప్పుడు తనకు తాను గుర్తించుటయే హరిని స్తుతించుట. హరి సత్యజ్ఞానానంద స్వరూపముగా ఉన్నాడు. ఆ హరినే నేను, నేను ప్రాణమున ఇత్యాదివిధముగా ఆత్మ విచారము చేసికొనగా నిద్రలో దాని ఉనికి నాకే తెలియుట లేదు. ఇది గాక ప్రాణము నాకు జ్ఞేయమైవున్నది. కావున జ్ఞాతనైన నేను ప్రాణము నెట్లగుదును. అట్లే వాగాది కర్మేంద్రియములు, శ్రోత్రాది జ్ఞానేంద్రియములు, మనోబుద్ధులు నాకు జాగ్రదావస్థలో జ్ఞేయములుగ నున్నవి. స్వప్నావస్థలో శ్రోత్రాది జ్ఞానేంద్రియ వాగాది కర్మేంద్రియములు స్వప్నావస్థలో జ్ఞేయములుగ నుండుటలేదు. ఒకప్పుడు వాని ఉనికి తోచినను మరొక్కప్పుడు వాని ఉనికి తోచుటలేదు. నిద్రావస్థలో జ్ఞానకర్మేంద్రియములు, మనోబుద్ధులు ఏవియు నిద్రలో జ్ఞేయములగుటలేదు. అనగా వాని ఉనికి అప్పుడు తోచుట లేదు. వాని ఉనికి సార్వకాలికము కాకపోవుట వలన జ్ఞేయములుగా మాత్రమే ఉండుటవలన ఒకప్పుడు దానియందు జ్ఞాతృభ్రమ కలిగినను ఎల్లప్పుడు ఉనికి తోచు నేను ఎప్పుడును జ్ఞేయముగా ప్రాణమనోబుద్ధి కర్మేంద్రియ జ్ఞానేంద్రియ స్వరూపుడనో కాజాలను. వ్యష్టి సమష్టులు కూడా జాగ్రదావస్థ జ్ఞేయములే అగుటచే వ్యష్టి (జీవుని) కన్న సమష్టి (హిరణ్యగర్భుని) కన్నను భిన్నుడను. ఇట్లు ప్రాణాది వ్యతిరిక్తత్వమును విచారించి జ్ఞప్తి స్వరూపుడైన వా డే హరియో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- పై శ్లోకమున ఆత్మయందు ప్రాణకర్మేంద్రియ జ్ఞానేంద్రియ మనోబుద్ధి వ్యష్టిసమష్ట్యాదులు వికల్పింపబడినవి. ఈ శ్లోకమున ఆ వికల్పములు నిరాకరింపబడుచున్నవి.

శ్లో॥ నాహం ప్రాణో నైవ శరీరం న మనో2హం
నాహం బుద్ధి ర్నాహ మహంకార ధియౌ చ।
యో2త్ర జ్ఞాంశ స్సో2స్మ్యహ మేవేతి విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 36

ప్రతిపదార్థము:- అహమ్=నేను, ప్రాణః=ప్రాణమును, న=కాను, శరీరమ్=(స్థూల) శరీరమును, న+ఏవ=కానేకాను, అహమ్=నేను, మనః= మనస్సును, న=కాను అహమ్=నేను, బుద్ధిః=బుద్ధిని, న=కాను, అహమ్=

నేను, అహంకారధియౌచ= అహంకారమును, బుద్ధినికూడ, న=కాను, యః= ఎవడు, అత్ర=ఇక్కడ, జ్ఞాంశః='జ్ఞ' అను అంశమునైన, అహమ్=నేను, స+ఏవ= ఆ(పరమాత్మను) హరినే, అస్మి= అయితిని, ఇతి=అని, యమ్=ఎవనిని, విదుః = తెలిసికొందురో, తమ్=ఆ, సంసార ధ్వాంతవినాశమ్=సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- నేను ప్రాణమును కాను, శరీరమును కానేకాను, నేను మనస్సును కాను, నేను అహంకారమును కానీ, బుద్ధిని కానీ కాను. ఇక్కడనున్న 'జ్ఞ' అను అంశమును ఆ పరమాత్మయైన హరి అని ఏ హరిని జ్ఞానులు తెలిసికొందురో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

వివరణము:- ప్రాణమనశ్శరీరబుద్ధ్యహంకారములు నావి. నేను వానికి జ్ఞాతను. అవి నాకు జ్ఞేయములు. కావున నేను ప్రాణమనశ్శరీర బుద్ధ్యహంకార రూపుడను కాను. ఈ శరీరమునందున్న 'జ్ఞ'అను అంశముగనున్న ఆ పరమాత్మయైన హరినే నేను. జ్ఞేయములోని 'జ్ఞ' అను అంశమే నేను. జ్ఞేయమైన విషయము నశించునది. కావున అది మిథ్య, సత్యము కాదు. కావున అది 'జ్ఞ'కు అంశభావము నాపాదింపలేదు. అయిన జ్ఞేయోపలబ్ధి కాలమున అది జ్ఞేయము కాదు అని చెప్పుటకు 'జ్ఞ' అంశముగా చెప్పబడినది. వాస్తవమునకు జ్ఞేయమే (విషయమే) 'జ్ఞ' అనగా జ్ఞాతలోనే కొంత కాలము జ్ఞేయముగ నుండి నశించునది కావున ఆ జ్ఞేయమే అంశము అయిన కావచ్చును. వాస్తవమునకు నిర్విషయ 'జ్ఞాన'మే ఇట 'జ్ఞ' గా చెప్పబడినది. 'జ్ఞ' అనగా జ్ఞానకర్త. జ్ఞానము నందే కర్తృత్వ ముపచారమాత్రముగా చెప్పబడినదని గ్రహింపలెను. జ్ఞానరూపమే 'జ్ఞ' . అదియే ఆత్మ (నేను) కాని జడములైన ఇంద్రియములలో ప్రతిఫలించి వానితో కర్మలను చేయించుచున్నది. ఈ కారయితృత్వము కూడ ఉపచారమే. ఈ జ్ఞాన ప్రతిఫలనమున అవి కర్మలు చేయుచున్నవి. మనకు కర్తృత్వ భ్రాంతి కలుగుచున్నది. ఈ విధముగా దేహేంద్రియాంతఃకరణములందు అహమ్ అను భ్రాంతి కలుగుటయే అహంకారము అని పిలువబడుచున్నది. ముందు గా మహత్తు యొక్క అంశమైన బుద్ధి (అంతఃకరణ చతుష్టయము నందొకటి)

ప్రతిఫలించుట అహంకారము కావున మహత్తు నుండి అహంకారము పుట్టునని శాస్త్రప్రసిద్ధి యేర్పడినది. ఇట్లే అహమ్ శ్రోతా ఇత్యాద్యను భవములు ఇంద్రియములందు బుద్ధి ద్వారమున అహమర్థమైన చైతన్యము ప్రతి ఫలించుటచే నేర్పడు భ్రాంతులే. నేను స్థూలుడను, కృశుడను ఇత్యాది భ్రాంతులు స్థూల దేహమునందు చైతన్యము ప్రతిఫలించుటచే కలిగిన భ్రాంతులు. ఈ అహమర్థము భిన్నములైన అంతఃకరణేంద్రియ స్థూల దేహాదులందు అహమర్థచైతన్య ప్రతిఫలము కలుగుటయే అహంకారము. అహమర్థమే ఆత్మ కాని ఇంద్రియాదులందు కలుగు అహంకారములు అహమర్థాత్మ రూపములు కావు. కావున మహత్తు యొక్క పరిణామములైన భూతేంద్రియములన్ని జడములే. సాంఖ్యశాస్త్రమునకూడ జడ ప్రకృతి పరిణామమైనందున జడమైన మహత్తుయొక్క పరిణామమైన అహంకారము ను జడముగానే చెప్పబడుచున్నది. కావున ఆ జడమైన అహంకారము నేను కానని శ్లోకమున చెప్పబడినది. ఇట్లు ప్రాణమనో బుద్ధ్యహంకారేంద్రియములైన వేవియు 'జ్ఞ'అను అంశములో చేరునవికావు. ఏ హరి 'జ్ఞ'అని 'జ్ఞ'అను అంశమనియు చెప్పబడుచున్నాడో సంసారాన్ధకారనివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారికః- ఈ శ్లోకమున విలక్షణుడైన హరియందు మరికొన్ని లక్షణములు చెప్పబడుచున్నవి.

శ్లో॥ సత్తామాత్రం కేవలవిజ్ఞాన మజం స
త్సూక్ష్మం నిత్యం తత్త్వమసీత్యాత్మసుతాయ।
సామ్నా మంతే ప్రాహ పితా యం విభు మాద్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 37

ప్రతిపదార్థము:- సత్తామాత్రమ్=సత్త స్వరూపముగా గల, కేవల విజ్ఞానమ్= విజ్ఞానైక స్వరూపముగల, అజమ్=పుట్టుకలేని, సత్= సద్రూపమైన, సూక్ష్మమ్= సూక్ష్మమైన, నిత్యమ్=నిత్యమైన, తత్= ఆ పరబ్రహ్మ, త్వమ్=నీవు, అసి= అయియున్నావు, ఇతి=అని, ఆత్మ సుతాయ= తనకుమారుని కొఱకు, సామ్నామ్= సామముల యొక్క, అంతే=చివఱ, విభుమ్=విభువైన, ఆద్యమ్=

మొదటివాడైన, యమ్=ఎవనిని గూర్చి, పితా= తండ్రి, ప్రాహ=చెప్పెనో, తమ్=ఆ, సంసారధ్వాంత వినాశమ్=సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- సత్తామాత్రము, విజ్ఞానైక స్వభావము,పుట్టుకలేని, సద్రూపమైన, సూక్ష్మమైన, నిత్యమైన ఆ బ్రహ్మయే నీవు అయియున్నావు అని సామముల అంతమైన ఛాందోగ్యమున తన కుమారునకు తండ్రి ఏ హరిని గూర్చి బోధించెనో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఏ పదార్థమైనను ఉన్నదని చెప్పబడుటకు ఉనికియే హేతువు. ఉనికిలేని యే పదార్థమును ఉన్నదని చెప్పబడదు. ఉనికి లేని పదార్థములు కుందేటి కొమ్ము, ఆకాశ పుష్పము, వంధ్యాపుత్రుడు మొదలైనవి. వానినున్న వస్తువులుగా నెవ్వరును చెప్పరుగదా. ఇట్టి వాటిని అభావ పదార్థములు అనెదరు. లేవు అను పదముచే బోధింపబడుటచే అనగా అభావ అను పదమునకు అర్థములగుటచే అభావ పదార్థములని చెప్పబడును. ఇవిగాక మిగిలినవన్ని భావ పదార్థములు. భావ పదార్థములను సత్ అని, అభావ పదార్థములను అసత్ అని అందురు. ఉన్న పదార్థములు సత్ అని, లేని పదార్థములు అసత్ అని చెప్పబడును. ఉనికి సత్త అని చెప్పబడును. అనగా సత్పదార్థము యొక్క ధర్మము బ్రహ్మమే సత్త అని చెప్పబడను. సత్త తప్ప మరేమి కానిది సత్తామాత్రమ్ అనబడును. విషయియైన పదార్థము జ్ఞాత్ర అని, విషయమైన పదార్థము జ్ఞేయము అని చెప్పబడును. విషయము విషయి కాని జ్ఞానము లేక విజ్ఞానము కేవల విజ్ఞానము అని చెప్పబడును. బ్రహ్మము కేవల విజ్ఞానమ్. అజమ్ అనగా పుట్టుక లేనిది. బ్రహ్మమునకు పుట్టుక లేదు కావున 'అజమ్' అని చెప్పబడును. ప్రతీయమానము "సత్" అని చెప్పబడును. ఒకొక్కప్పుడు లేని పదార్థములు ప్రతీయమానములగును. లేని పదార్థముల ప్రతీయమానత ఎట్లు? రజ్జువునందు లేని సర్పము ప్రతీయమానమగుచున్నది గదా! కావున సర్పము లేని పదార్థము అయినను ప్రతీయమానమగుచున్నదన వచ్చును. లేనిదే ప్రతీయమానము కాదు. కావున రజ్జువు నందు ఉన్నదని లేదని చెప్పరాని రజ్జువు నందలి సర్పము నిర్వచింపరానిది. కావున అది అనిర్వచనీయము అని అద్వైతులు చెప్పెదరు. బ్రహ్మ సర్వకాల ప్రతీయ

మానము కావున 'సత్' అని చెప్పబడినది. దాని ప్రతీతికై ఏ ప్రమాణము అక్కఅలేదు. అది స్వయముగా ప్రతీతిరూపము. ప్రతీయ మానము అనగా ప్రతీతి గోచరము కావున ప్రతీతి అనగానేమో తెలిసికొన వలెను. ప్రత్యక్షాది ప్రమాణములచే విషయము యొక్క ప్రతీతి కలుగును. ప్రత్యక్షము అనుమానము ఆగమము మొదలైన ప్రమాణములలో దాదాపు సర్వసమ్మతమైన ప్రమాణము ప్రత్యక్షము. ప్రత్యక్షమనగా శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములలో దేనినైన ప్రత్యక్షమనవచ్చును. ఇవి బాహ్య వస్తువులకు ప్రమాణములు. అంతరములైన సుఖదుఃఖాదులకు ప్రమాణము అంతః కరణము. అంతరింద్రియము అని చెప్పబడు మనస్సు కూడ ప్రత్యక్ష ప్రమాణమే. అది అంతఃకరణములోని ఒక అంశమే. వీనిలో ఎక్కువ ఇంద్రియములచే తెలియబడు భూమి ఎక్కువ స్థూలము. శబ్దస్పర్శరూప రసగంధాదులు కలిగియున్న భూమి పంచేంద్రియ గోచరము. జలమునకు గంధము లేదు కావున జలము స్థూలమే అయినను భూమి దృష్టితో సూక్ష్మము. ఏల? అది (జలము) చతురింద్రియ గోచరము. అట్లే అగ్నిలో రసగంధములు లేవుకదా! జిహ్వాఘ్రాణములతో దానిని గ్రహింపలేము. శ్రోత్రత్వక్చక్షువుల మూడింటి తోడనే గ్రహింపగలము కావున అగ్ని జలము కన్న సూక్ష్మము. రూపరస గంధములు లేకపోవుట వలన శ్రోత్రత్వగింద్రియ ద్వయముచే గ్రహింపదగిన వాయువు కన్న స్థూలము. భూజలములకన్న సూక్ష్మము. ఆకాశమున శబ్దమొకటే యున్నది. వాయువునకున్న స్పర్శకూడ లేదు గావున త్వగింద్రియము చేతను గ్రహింపరానిది. కావున ఆకాశమునకన్న స్థూలము. శ్రోత్రత్వక్చక్షురింద్రియ త్రయగ్రాహ్యమయిన అగ్నికన్నా సూక్ష్మము. పంచమహాభూతములలో మిక్కిలి సూక్ష్మము ఆకాశము. మిక్కిలి స్థూలము భూమి. పంచమహాభూతముల కన్న పంచేంద్రియములు సూక్ష్మములు. ప్రత్యక్షప్రమాణములైన ఇంద్రియములు వానిని గ్రహింపజాలవు కావున అవి ప్రత్యక్షములు అనగా ప్రత్యక్ష ప్రమాణగోచరములు కావు. అవి అనుమాన ప్రమాణ వేద్యములు కావున అనుమేయములు. బ్రహ్మము అనుమాన ప్రమాణమునకును గోచరము కానిది కావున శ్లోకమున సూక్ష్మము అని చెప్ప బడినది. బ్రహ్మము నిత్యము. అది రజ్జుసర్పమువలె ఒకప్పుడు కనబడి తరువాత కనబడునట్టిది కాదు. ఒకప్పుడుండి ఒకప్పుడు లేకుండ పోవునట్టిది

కాదు. ఒకప్పుడుండి మరొకప్పుడు పోవుదానిని అనిత్యము అందురు. బ్రహ్మ అట్లుగాక ఎల్లప్పుడు ఉండునది కావున నిత్యము. అజమ్ అనగా పుట్టుక లేనిది. అని ఈవఱకే చెప్పబడినది. పుట్టుక లేనిది అనగా చావుకూడా లేనిదనియు చెప్పినట్లేయైనది. కావున నిత్యము అని మఱల చెప్పుట ఏల? కొన్ని వస్తువులు పుట్టుక లేకపోయినను చావు కలిగియుండును. ఒక విషయమును నీవు ఇప్పుడు కొత్తగా చూచిగాని పెద్దలు చెప్పగా విని గాని తెలిసికొంటివి. దానిని గూర్చిన అజ్ఞానమిప్పుడు తొలగినది కాని ఆ అజ్ఞానమెప్పటి నుండి యున్నదో నీవుచెప్పలేవు. పూర్వజన్మమునను దాని అజ్ఞానము నీకు లేదని చెప్పలేవుగదా! కావున నీ ఆ అజ్ఞానము అన్నది పుట్టకలేనిది అని చెప్పవలెను కాని దానికిప్పుడు నాశము కలిగినదికదా! బ్రహ్మము ఆ విధముగా పుట్టుక లేక పోయినను అజ్ఞానము వలె నశించునట్టిది కాదు. కావున అది అజ్ఞానము వలె అనాదియైనను దాని వలె అంతము లేదు కావున అనంతము అని చెప్పుటకై మరల బ్రహ్మ నిత్యము అని ఈ శ్లోకమున చెప్పబడినది. సామవేదము వేదములలో శ్రేష్ఠమైనది. వేదానాం సామవేదో2స్మి అని భగవద్గీతలో సామవేదము తన విభూతియని, ఒక్కొక్క తెగలో శ్రేష్ఠమైన వస్తువు నేను అని చెప్పుచు శ్రీకృష్ణుడు తెలిపినాడు. అన్ని వేదములకును సంహితా బ్రాహ్మణములు ఆరణ్యకములు మొదట నుండును. చివఱ ఉపనిషత్తు లుండును. సామవేదమంత్రములకు అనగా సామసంహిత లకు, సామ బ్రాహ్మణములకు, సామారణ్యములకు తరువాత సామవేదీయోప నిషత్తు లున్నవి. వానిలో ఛాందోగ్యోపనిషత్తు చాలా ముఖ్యమైనది. అందు ఉద్దాలకుడు అను తండ్రి తన కుమారుడైన శ్వేత కేతువునకు ఆ బ్రహ్మము నీవే అను అర్థమిచ్చు 'తత్త్వమసి' అను వాక్యమునుపదేశించెను. తత్ పదము బ్రహ్మకు, త్వమ్ పదము జీవునికి వాచకము, అసి పదము తదుభయైక్యమును బోధించును. పై జీవుడు బ్రహ్మము అగుట అనునవి పదార్థములు. జీవుడు బ్రహ్మ అగుట అనునది ఉపపన్నముకాదు ఏల? జీవుడు అల్పజ్ఞాన శక్తికుడు. బ్రహ్మ సర్వజ్ఞానశక్తికుడు. అల్పము నెఱుగుట జీవుని కున్నది. సర్వము నెఱుగుట బ్రహ్మమున కున్నది. ఈ ఇరువురొకటి అగుట ఎట్లు? కావున శక్తిచే చెప్పబడిన ఆ అర్థములు కుదరవు, ఉపపన్నములు కావు. కావున లక్షణావృత్తి ననుసరించి, ఆశ్రయించి జీవుడు కొంచెమెఱుంగుట యేల?

ఆతని బుద్ధి చిన్నది అగుట దానికి హేతువు. బ్రహ్మము సర్వము నెఱుగుటకు ఆయన బుద్ధికి హేతువు కావున అల్పత అధికత అను లక్షణములుగల బుద్ధిని వదలి ఎఱుగుట అను జ్ఞాన మాత్రము ఉభయులలో ఏకముగానే ఉన్నది కావున లక్షణావృత్తిచే శ్వేతకేతుడు జ్ఞానమాత్ర స్వరూప బ్రహ్మము నెఱిగెను. ఏ హరి రూప బ్రహ్మను తండ్రి యుపదేశముచే శ్వేతకేతు డెఱిగినో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- పై శ్లోకమున 'తత్త్వమసి' అను ఉపదేశము చెప్పబడినది. సమాధియందు దాని ననుభవమునకు తెచ్చుకొనుట యెట్లో ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

శ్లో॥ మూర్తాఽమూర్తే పూర్వ మపోహ్యాథ సమాధౌ
దృశ్యం సర్వం నేతి చ నేతీతి విహాయ।
చైతన్యాంశే స్వాత్మని సంతం చ విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 38

ప్రతిపదార్థము:- పూర్వమ్=మొదట, సమాధౌ=సమాధియందు, మూర్తామూర్తే=మూర్తమును, అమూర్తమును, అపోహ్య=తొలగించి, అథ=అటు కాకున్నను, సర్వమ్=మొత్తము, దృశ్య=దృశ్యమును, న=లేదు, ఇతి=అని, న=లేదు, ఇతి=అని, విహాయచ=వదలియు, స్వాత్మని=తనయందు, చైతన్యాంశే=చైతన్యాంశమునందు, సంతమ్=(సద్రూపుడై)యుండు, యమ్=ఎవనిని, విదుః=తెలిసికొందురో, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్= సంసారాన్ధ కార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- తొలుత సమాధి యందును, మూర్తా మూర్తములను తొలగించి, సర్వదృశ్యమును ఆత్మకాదు, ఆత్మకాదు అని ఒక్కొక్కటిని వదలి తనలోని చైతన్యాంశమునందు సద్రూపుడైన హరి నెఱుగుదురో ఆ సంసారాన్ధ కార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఒకచోట ప్రశాంతముగా కూర్చొని మొదట మూర్తామూర్తములను ఆత్మకాదని తొలగించవలెను. మూర్తము లనగా అవయవ సంస్థానము కలవి. అమూర్తము లనగా అవయవ సంస్థానము

లేనివి. మూర్తములు పృధివ్యప్తేజో వాయువులు. అమూర్తములు దిక్కాలాకాశాదులు. (మఱికొందరు మూర్తి అనగా ఆకారముగల పృధి వ్యప్తేజస్సులను మూర్తములని, మూర్తి అనగా ఆకారము లేనందున వాయ్వాకాశాదులను అమూర్తములని చెప్పెదరు). పృధివ్యప్తేతేజో వాయువులు అణువులు కలవి. అవి మూర్తములు, ఆకాశాదులు అణునిర్మితములు కావు. అవి అమూర్తములు, అణువులు లేనివి. ఆత్మ (పదార్థము) మూర్తము. అమూర్తము కాదు. కావున ఆత్మకాని వానితో నాకేమి పని అని వాని నుపేక్షింప వలెను. జాగ్రత్స్వప్నసుషుప్తులలో దృశ్యము లున్నవి. జాగ్రదవస్థలో మనో బుద్ధీంద్రియములకు గోచరములైన విషయములన్నియు అనగా పిండాండ బ్రహ్మాండములు మొత్తము దృశ్యములు. మనోబుద్ధీంద్రియములును దృశ్యములే అని ఇంద్రియసహితముగా విషయములను ఆత్మకాదు గదా. ఆత్మకాని వానితో నేమి పని అని విడువవలెను.స్వప్న ప్రపంచము నందలి దృశ్యము లెట్లు తాత్కాలికముగా నుండి తరువాత జాగ్రదవస్థలో నశించునో అట్లే జాగ్రదవస్థా కాలమున వుండి దృశ్యములు అవస్థాంతరములైన స్వప్న సుషుప్తులలో లేనివి కావున అవియు మిథ్యలే, అని పరిత్యజింప వలెను. జాగ్రదవస్థలోని స్రక్చందన వనితాది భోగములన్నియు స్వప్న గజారోహణ భోగసదృశములని వానియందాసక్తి విడువవలెను. ఇట్లు తదృశ్యమ్ తన్నశ్యమ్ (ఏది దృశ్యమో అది నశ్యము) అను సిద్ధాంతమును విశ్వసించి దృశ్యము నంతయు విడచిన పిమ్మట మిగులున దేది, తన ఆత్మ యొక్కటే అనగా తానే. తన దేహేంద్రియాదులును మిథ్యలే కావున వానిని ప్రారబ్ధ భోగానుభవ సమాప్తి (మృతి) పర్యంతము, స్వప్నవస్తు సదృశములుగనే చూడవలెను. ఏది ఆత్మయో చెప్పరాదు కావున దృశ్యము నంతయు కాదు కాదు అని ఆత్మను తెలిసి కొనవలెను, జీవుడని, దేవుడని, దృశ్యమని, ద్రష్టయని వ్యవహారమును పరిత్యజించి ఏ మనస్సుతో దీని నంతను త్యజించెదరో ఆ మనస్సును దృశ్యమే అని దానిని గూడ విడచి తనలో తానే ఆనందించు చుండవలెను. ఇట్లు ఏ హరిని జ్ఞానులు స్వాత్మగా నెఱుగుదురో ఆ సంసారాన్దకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున దృశ్యమైన దంతయు ఆత్మయందే పడుగు పేకలవలె అల్లుకొనియున్నట్లు, సర్వము దృశ్యమగుచున్నదని చెప్పబడుచున్నది.

శ్లో॥ ఓతం ప్రోతం యత్ర చ సర్వం గగనాంతం
యో2స్థూలానణ్వాదిషు స్థిరో2క్షర సంజ్ఞః।
జ్ఞాతా2తో2న్యో నేత్యుపలభ్యో న చ వేద్య
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 39

ప్రతిపదార్థము:- యత్ర= ఎవని యందు, గగనాంతమ్=గగనము చివఱగల, సర్వమ్= అంతయు, ఓతమ్= అడ్డముగా అల్లుకొని యున్నదో, ప్రోతమ్చ=నిలువుగా అల్లుకొని యున్నదో, యఃచ= ఎవడు, అస్థూలానణ్వాదిషు=స్థూలముకాదు, అణువుకాదు ఇత్యాది వ్యవహారములందు, అక్షర సంజ్ఞః='అక్షర' అను సంజ్ఞగలవాడై, స్థిరః=నిశ్చలముగా నున్నాడో, అతః= ఈ యక్షర స్వరూపుడైన శ్రీహరి కంటె, అన్యః=ఇతరుడైన, జ్ఞాతా=జ్ఞాత, న=లేడో, ఇతి=అని, ఉపలభ్యః=తెలిసికొన దగినవాడు, చ=మరియు, వేద్యఃన=తెలియదగినవాడు కాడో, తమ్=ఆ, సంసార ధ్వాన్త వినాశమ్= సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ఈ దృశ్యమంతయు ఎవని యందు పడుగుపేకల వలె అల్లుకొని యున్నట్లు కనబడుచున్నది!. ఎవడు అస్థూలమనణువు అని వ్యవహరింపబడునో, అక్షర సంజ్ఞుడై నిశ్చలముగానున్నాడో, అన్యజ్ఞాత లేడని తననే సాక్షాత్కరించు కొనవలసియున్నదో, వేద్యుడుకాదో, ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఆత్మస్థూలము కాదు అని చెప్పవలసినప్పుడు సూక్ష్మము అని చెప్పబడును. అస్థూల శబ్దము సూక్ష్మము అని చెప్పదు.స్థూలత్వమును మాత్రము నిషేధించును. అట్లే అనణు అన్నప్పుడు అది మహత్తు అను అర్థమును గ్రహింపరాదు. అణుత్వమును మాత్రమే నిషేధించునని తెలిసి కొనవలెను. గగనాంతపదము సర్వదృశ్య మాతని యందున్నదని చెప్పదు. అదృశ్యము ఆత్మయందు, భూమియందు ఊయి ఉన్నట్లు సంయోగ సంబంధము కలిగియున్నదని భావింపరాదు. ఆత్మసత్త కన్న భిన్నమైన సత్త దృశ్యమునందు లేకుండుటయే ఆత్మయందు జగ మున్నదని చెప్పుటలో తాత్పర్యము. సర్వదృశ్యము జ్ఞేయము. ఆత్మ జ్ఞాత అన్నప్పుడు ఆత్మకన్న

వేరు జ్ఞాత లేదనుటయే తాత్పర్యము. జ్ఞాతృత ఉపచార మాత్రమని ఈ వఱకే చెప్పబడినది. అట్లే 'సత్' అని చెప్పుటలో ఇంద్రియగోచరమని అర్థముకాదు. అట్లే అసత్ అని చెప్పుటలో అది కుందేటి కొమ్ము అని తాత్పర్యము కాదు. అధి సదసద్విలక్షణమని చెప్పుటయే తాత్పర్యము. ఇట్లు ఆత్మను సర్వవిశేష నిషేధ శేషముగా సాక్షాత్కరించుకొనవలె ననుటలో కాని ఆత్మగా ఆత్మను తెలిసికొనవలసిన దనుటలోగాని అది వేద్యమని తాత్పర్యము కాదు. ఇట్లు అస్థూలాది లక్షణములు విలక్షణుడగు హరిని తెలిసికొనుటకు సహకరించు లక్షణములేగాని ఆ లక్షణములతో ఆతడు వేద్యుడగునని తాత్పర్యముకాదు. అక్షర సంజ్ఞుడగు ఏ హరి నిట్లు విలక్షణముగా తెలిసికొందురో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున ఆత్మరూప హరియొక్క సత్యత చెప్పబడు చున్నది.

శ్లో॥ తావత్సర్వం సత్యమివాభాతి యదేత
ద్యావ త్సోఽస్మీత్యాత్మని యో జ్ఞో న హి దృష్టః।
దృష్టే యస్మి న్సర్వ మసత్యం భవతీదం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 40

ప్రతిపదార్థము:- యావత్=ఎంతవరకు, ఆత్మని=తనలో, సః=ఆ హరిని, అస్మీతి=అగుచున్నానని, యః=ఏ, 'జ్ఞః'=జ్ఞప్తి స్వరూపుడు, న హి దృష్టః= చూడబడలేదో, తావత్=అంతవఱకు, యత్=ఏ, ఏతద్=ఈ, సర్వమ్= అంతయు, సత్యమివ=సత్యమువలె, ఆభాతి=భాసించునో, యస్మిన్=ఏ హరి, దృష్టే=చూడబడగా, ఇదమ్=ఇది, సర్వమ్=అంత, అసత్యమ్=అసత్యము, భవతి=అగునో, తమ్=ఆ, సంసార ధ్వాన్తవినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- ఎంతవఱకు ఆత్మ రూప హరి సాక్షాత్కారము కలుగదో అంతవరకు ఈ జగమంతయు భాసించును. ఆత్మ రూప హరి సాక్షాత్కరించ గనే ఇదంతయు అసత్యమగును. అట్టి సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- ఎంతవిన్నను, ఎంత తెలిపినను, సత్యమనబడిన బ్రహ్మ మనకు సత్యముగా తోచుటలేదు. మిథ్యయని చెప్పబడిన ఈ జగము అసత్యముగా తోచుట లేదు. ఏల? ఇవి రెండును దృష్టులే. ఒకటి సత్యదృష్టి ఒకటి అసత్యదృష్టి. అసత్యము సత్యముగా తెలియుచున్నంత వఱకు ఆ సత్యము అసత్యముగా తోచదు. అట్లే సత్యము అసత్యముగా తెలియుచున్నంత వఱకు సత్యము సత్యముగా తోచదు. ఒక కఱ్ఱ ఏనుగున్నది. అసత్య దృష్టిగల బాలున కేనుగుగానే కనబడును. దానిని కఱ్ఱ అని చెప్పినను అంగీకరించడు దానితో ఆడుకొనుట మానడు. నిజమైన ఏనుగును చూచి దానిపై స్వారీ చేయుట ఎఱిగిన పెమ్మట వాడు కఱ్ఱ ఏనుగును కఱ్ఱగానె చూచును కానీ ఏనుగుగా చూడడు. కఱ్ఱగుఱ్ఱము అను ఒకే వస్తువు కఱ్ఱగా పెద్దలకు (జ్ఞానులకు) గుఱ్ఱముగా బాలురకు (అజ్ఞానులకు) కనబడును.అట్లే మనము ఆత్మ (బ్రహ్మ) సాక్షాత్కరించుకొననంత వఱకు ఈ జగము బ్రహ్మ భిన్నముగా సత్యముగానే కనబడును. పైగా బ్రహ్మ కనబడకపోవుటచే అసత్యముగా భావించుట జరుగుచున్నది. ఆత్మ (బ్రహ్మ) సాక్షాత్కారము కలుగగానే అప్పటి వఱకు సత్యముగా కనబడిన ఈ జగము అసత్యమై పోవును. ఏ సత్య హరి సాక్షాత్కారముతో ఈ జగమసత్యమై సంసారాంధ కారము నివారింపబడునో ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున మలినమైన బంగారమగ్నిసంపర్కమున శుద్ధమగునట్లు యోగాభ్యాస ప్రజ్వలితమైన జ్ఞానాగ్నిచే జ్ఞేయాంశము తొలగిన 'జ్ఞ' స్వరూపము శుద్ధమై సాక్షాత్కరించునని చెప్పబడు చున్నది.

శ్లో॥ రాగాముక్తం లోహయుతం హేమ యథాఽగ్నౌ
యోగాష్టాంగై రుజ్జ్వలిత జ్ఞానమయాగ్నౌ।
దగ్ధ్వాఽఽత్మానం జ్ఞం పరిశిష్టం చ విదు ర్యం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 41

ప్రతిపదార్థము:- లోహయుతమ్=ఇనుముతో గూడిన, హేమ= బంగారము, అగ్నౌయథా=అగ్నియందువలె, రాగాముక్తమ్=రాగముతొలగని, ఆత్మానమ్=తనను (మనసును), యోగాష్టాంగైః=యోగము యొక్క ఎనిమిది

అంగములచేత, ఉజ్వలిత= పైకి(బాగుగా)మండింపబడిన, జ్ఞానమయాగ్నౌ= జ్ఞానమనెడు అగ్నియందు, దగ్ధ్వా= కాల్చి, పరిశిష్టమ్=మిగిలిన, 'జ్ఞ'మ్= జ్ఞస్వరూపుడైన, తమ్=ఆ, సంసారధ్వాన్త వినాశమ్ =సంసారాన్ధకార వినాశకుడైన, హరిమ్=హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- లోహములతో మలినమైన బంగారము అగ్నియందు వలె, రాగాదిమలినమైన ఆత్మను అనగా మనసును యోగాష్టాంగములచే ప్రజ్వలితమైన జ్ఞానమను అగ్నియందు కాల్చి మిగిలిన శుద్ధ 'జ్ఞ' స్వరూపుడైన ఏ హరిని జ్ఞానులు తెలిసికొందురో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- అంతఃకరణమున చైతన్య ప్రతిబింబ ముండును. అదియే జ్ఞాత అనబడును. రాగాది దోషములును అంతః కరణమునందే జన్మజన్మలనుండి గూడుకట్టుకొని యున్నవి. ఆ కారణము వలన జ్ఞాతయొక్క శుద్ధ స్వరూపము తోచుటలేదు. ఎంత వేదాంతులైనను రాగమోహాదులతో అజ్ఞులవలె ప్రవర్తించుట లోకమున మనము చూచుచున్నాము. రాగాది మాలిన్యములు తొలగనంత వఱకు ఆత్మయొక్క శుద్ధ స్వరూపము సాక్షాత్కరించదు. అందువలన మొదట రాగాది మాలిన్యము తొలగించు కొనుట ముముక్షువున కావశ్యకము. యోగము యొక్క అష్టాంగముల అభ్యాసము వలన అంతఃకరణమున జ్ఞానాగ్ని బాగుగా వుండును. దానిలో రాగాది మాలిన్యము దగ్ధమైపోగా శుద్ధమైన ఆత్మస్వరూపము సాక్షాత్కరించును. యోగాంగము లెనిమిది. 1) యమము(లు) = అహింసా, సత్యాస్తేయ, బ్రహ్మచర్యా పరిగ్రహము లైదు 2) నియమము(లు) = శౌచ, సంతోష, తపః, స్వాధ్యాయేశ్వర ప్రణిధానములు ఐదు. 3) ఆసనము(లు) = పద్మ, స్వస్తిక, వీరాదు లనేకములు. 4) ప్రాణాయామము(లు) = రేచక, పూరక, కుంభకములు మూడు. (వీనికి రిక్తకము కలిపి నాలుగని కొందఱు చెప్పెదరు) 5)ప్రత్యాహారము = విషయముల నుండి మనస్సును మరలించుట. 6)ధారణ = మరలించిన మనస్సు నొకచోట బంధించియుంచుట. 7) ధ్యానము = బంధించి యుంచిన మనస్సున అన్యవిషయము చేరకుండ నుంచుట (తైలధారవలె ఏక విషయజ్ఞానము ప్రవహించుటయని కొందఱు

చెప్పెదరు). 8) సమాధి = జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ త్రిపుటిని నశింపజేసి తన జ్ఞాన స్వరూపమున నుండుట. ఈ ఎనిమిది అంగముల చేత చిత్తవృత్తి నిరోధము (యోగము) కలుగును. జ్ఞానాగ్ని బాగుగా ప్రజ్వలించును. రాగాది మాలిన్యము దగ్ధమై శుద్ధమైన 'జ్ఞ' స్వరూపము మిగులును. మిగిలిన జ్ఞాన స్వరూపుడగు నేహరిని జ్ఞానులు తెలుసుకొందురో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- ఈ శ్లోకమున భక్తితో ఆ హరి నారాధించిన జ్యోతిర్మయుడుగా సాక్షాత్కరించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ యం విజ్ఞానజ్యోతిష మాద్యం సువిభాంగం
హృద్యర్కేంద్వగ్న్యోకస మీడ్యం తటిదాభమ్।
భక్త్యా22రాధ్యేహైవ విశం త్యాత్మని సంతం
తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 42

ప్రతిపదార్థము:- హృది=హృదయరూపమైన, ఆత్మని= అంతఃకరణమందు, సంతమ్=ఉండు, అర్కేంద్వగ్న్యోకసమ్=సూర్యచంద్ర వహ్నులకు నిలయమైన, తటిదాభామ్=మెఱుపు వంటి, ఈడ్యమ్=స్తుతింపదగిన, సువిభాంగమ్=మంచి కాంతిమయములైన అంగములు గల, విజ్ఞాన జ్యోతిషమ్ =విజ్ఞాన ప్రకాశ రూపుడైన, యమ్= ఏ హరిని, భక్త్యా=భక్తితో, ఆరాధ్య= ఆరాధించి, ఇహ ఏవ=ఈ లోకమునందే, విశంతి= ప్రవేశించెదరో, తమ్=ఆ, సంసారధ్వాన్తవినాశమ్=సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్= హరిని, ఈడే=స్తుతించెదను.

తాత్పర్యము:- తన హృదయము నందున్న సూర్యచంద్రాగ్ని స్వరూపుడై మెఱుపురీతి కాంతిగల, బాగుగా ప్రకాశించు అవయవములుగల ఏ హరిని భక్తితో ఆరాధించి జ్ఞానులు ప్రకాశించెదరో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:- యోగాంగాభ్యాసమువలన జ్యోతిర్మయహరి యందు ప్రవేశము లభించును. మూలాధారము నుండి బ్రహ్మ రంధ్రము వరకు గల

విద్యుల్లేఖగా స్వాత్మ నుపాసించుట యోగుల సంప్రదాయ మందురు. మూలాధార స్వాధిష్ఠానము లందు రోహిత వర్ణముగల అగ్ని ప్రకాశ ముండునని కొందఱు చెప్పెదరు. 'యదగ్నే రోహితమ్ రూపమ్' అని వేద మంత్రము. అగ్ని వర్ణము రోహితమని చెప్పుచున్నది. ఎఱుపు వన్నె అని రోహిత శబ్దము యొక్క అర్థము. మఱికొందఱగ్ని వర్ణము నీలమని చెప్పెదరు. మణిపూర, అనాహత ములందు సూర్యవర్ణమైన ఆరుణ్యముం(ఎఱుపు) డును. విశుద్ధాజ్ఞా చక్రములందు చంద్రవర్ణమైన శౌక్ల్యముండును. కాని ఈ శ్లోకమున విజ్ఞాన జ్యోతి రుపాసనమే చెప్పబడినది.మనోబుద్ధ్యహంకారములే చంద్రహర్యాగ్నులు. యోగిధ్యేయమైన ఈ జ్యోతిర్మయ స్వరూపమున హరిని భక్తితో ధ్యానింప వలయును. ఉపాసనా భక్తులు అన్యోన్య పరిపోషకములు. ప్రియమైన వస్తువును మనసులో నెక్కువగా భాసించుట ఉపాసన అగును ఉపాస్యమున ప్రేమతో తన సర్వస్వమును సమర్పించుట భక్తి అగును. ఈ శ్లోకమున ఉపాసనాభక్తుల పరస్పర పరిపోషకత్వముతో బాటు పరమాత్మలో ప్రవేశించుట అను మోక్షమున కవి సాధనములని చెప్పబడినది. ఇట్లుపాసనా భక్తులతో నే హరిలో సాధకులు ప్రవేశించెదరో సంసారాన్ధకార నివారకుడైన ఆ హరిని స్తుతించెదను.

అవతారిక:- పై శ్లోకమున భక్తితో ఆరాధించి హరిని చేరుట చెప్ప బడినది. ఈ శ్లోకమున ఆ హరి కాపాడుగాక అను ఆశీస్సు చెప్పబడుచున్నది.

శ్లో॥ పాయాద్భక్తం స్వాత్మని సంతం పురుషం యో
భక్త్యా స్తౌతీత్యాంగిరసం విష్ణు రిమం మామ్।
ఇత్యాత్మానం స్వాత్మని సంహృత్య సదైక
స్తం సంసారధ్వాంత వినాశం హరి మీడే॥ 43

ప్రతిపదార్థము:- భక్తమ్= భక్తుడైన, స్వాత్మని=తన ఆత్మలో, సన్తమ్= ఉండు, పురుషమ్=పురుషుడైన, ఆంగిరసమ్= ఆంగీరో గోత్ర సంభవుడైన, ఇమమ్=ఈ, మామ్= నన్ను, భక్త్యా=భక్తితో, స్తౌతి ఇతి=స్తుతించుచున్నాడో అని, యః=ఏ విష్ణువు, పాయాత్= కాపాడునో, ఇతి=ఈ విధముగా, ఆత్మానమ్ =ఆత్మను, స్వాత్మని=తన ఆత్మయందు, సంహృత్య= లీన మొనరించి, సదా= ఎల్లప్పుడు, ఏకః=ఒక్కడు గనే ఉండునో, తమ్= ఆ, సంసారధ్వాన్త వినాశమ్=

సంసారాన్ధకార నివారకుడైన, హరిమ్=హరిని, ఈడే= స్తుతించెదను.

తాత్పర్యము:- తనలో నివసించుచుండు, భక్తితో స్తుతించుచున్నాడని, ఆంగిరస గోత్రోద్భవుడనైన ఈ నన్ను ఏ విష్ణువు కాపాడునో, జీవాత్మను స్వాత్మలోనే నే హరిని లీనమొనర్చి యొకడుగానే యుండునో ఆ సంసారాన్ధకార నివారకుడైన హరిని స్తుతించెదను.

వివరణము:-ఈ శ్లోకముతో నీ స్తుతి దాదాపు ముగిసినట్లే. మకుటము తర్వాతి శ్లోకమున లేక పోవుటచే నీ శ్లోకము చివరిదని చెప్పవచ్చును. రచయిత తనను ఆంగీరస గోత్రునిగా చెప్పుకొనినాడు. తానే విష్ణువును స్తుతించినాడో ఆ విష్ణువు తనను కాపాడవలెనని ఈ శ్లోకమున రచయితచే అభ్యర్థించబడినది. అభ్యర్థనను మన్నించి రచయితను తనలో లీనమొనర్చుకొనుపని ఏ హరిదో ఆ సంసారాన్ధకారనివారకుడైన హరిని స్తుతించెదను.

అవతారిక:- పై శ్లోకముతో 'తం సంసారధ్వాన్త వినాశం హరి మీడే' అనుమకుటముగల శ్లోకములన్ని ముగిసినవి. ఈ శ్లోకమున ఈ స్తోత్ర పఠన శ్రవణ ఫలము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఇత్థం స్తోత్రం భక్తజనేడ్యం భవభీతి
ధ్వాంతార్కాభం భగవత్పాదీయ మిదం యః।
విష్ణోర్లోకం పఠతి శృణోతి వ్రజతి జ్ఞో
జ్ఞానం జ్ఞేయం స్వాత్మని చాప్నోతి మనుష్యః॥ 44

ప్రతిపదార్థము:- ఇత్థమ్=ఈవిధముగా, భక్తజనేడ్యమ్=భక్తజనులచే స్తుతింపదగిన, భవభీతి ధ్వాంతార్కాభమ్=సంసారభయమును, చీకటికి సూర్యుడైన, భగవత్పాదీయమ్=భగవత్పాదులకు సంబంధించిన, ఇదమ్=ఈ స్తోత్రమును, యః=ఏ, మనుష్యః=మనుషుడు, పఠతి=చదువునో, శృణోతి= వినునో, సః=అతడు, విష్ణోః=విష్ణువుయొక్క, లోకమ్=లోకమును గూర్చి, వ్రజతి=పోవును, జ్ఞః=జ్ఞ స్వరూపుడై, జ్ఞానమ్=జ్ఞానమును, జ్ఞేయమ్= జ్ఞేయమును, స్వాత్మని =తన ఆత్మయందు, ఆప్నోతిచ=పొందును.

తాత్పర్యము:- భక్త జనుల చేత స్తుతింపదగిన సంసారాన్ధకార నివారక

సూర్యకాంతియని చెప్పదగిన భగవత్పాదీయమైన ఈ స్తోత్రము నెవడు చదువునో, లేక మరొకడు చదువు చుండగా వినునో ఆతడు విష్ణులోకమునకు పోవును మరియు జ్ఞాన జ్ఞేయములను తనలో లీనమొనర్చుకొని 'జ్ఞ' స్వరూపస్థితి అను కైవల్యము నొందును.

వివరణము:- ఇది విష్ణుస్తోత్రము, హరిస్తోత్రము. విష్ణువు, హరి అను పదములు సర్వవ్యాపక చైతన్య బోధకములే అయినను వైకుంఠవాసి విష్ణువు లేక హరిని కూడ బోధించును. ఈ స్తోత్రపఠన శ్రవణముల పార్యంతిక ఫలము అనగా చివరి ఫలము కైవల్యము, అవి జీవపరమాత్మ భేదములేని ఏకాంతిక నిత్య సుఖరూపము. అవాంతర ఫలము విష్ణులోక ప్రాప్తి. నామ రూపములుగల విష్ణువు కార్యబ్రహ్మమని చెప్పబడును. అయినను ఆయన శుద్ధ బుద్ధి అనగా ఆత్మ జ్ఞానము (తనకు పరమాత్మకు బేధములేని స్థితి) గలవాడు కావున ఆచార్య స్థానము వహించదగినవాడు. పూర్వకల్పమున విష్ణూపాసన మొనరించి ఈ కల్పమున వైకుంఠాధిపతిత్వము నొందెను. విష్ణువు యొక్క నిష్కామకర్మోపాసనములను ఒనరించిన వారీ విష్ణులోకమును చేరుకొందురు. విష్ణువు కూడ తనలోకమును తన నామరూపములను విసర్జించి, నిర్గుణ పరమాత్మలో లీనమగుటకు ముందు తన లోకవాసులకు తత్త్వమసి' యను మహావాక్య ముపదేశించగా ఆ విష్ణువుతో పాటే ఆ లోకవాసులును కైవల్యము నందెదరు. విష్ణులోకము చేరుట సాలోక్యముక్తి 'సనబడును. ఈ స్తోత్రపఠన శ్రవణఫలము విష్ణుసాలోక్యము అనగా విష్ణువుతో కలసి విష్ణులోకమునందుట. భక్తులందరు నీ స్తోత్రమును చదివి విని అవాంతర ఫలమైన విష్ణుసాలోక్యమును, పార్యంతికమైన కైవల్యమును పొందుదురు గాక.

మచ్ఛంకరాచార్యకృత హరి మీడే స్తవః సంపూర్ణమ్

రాధశర్మకృత మచర్చికా వ్యాఖ్యానం సంపూర్ణమ్

శ్రీః

'మచర్చికా' శబ్దానికి రామమిశ్రీయుని నిర్వచనాన్ని అనుసరించి,
" శివుని/విష్ణుని గూర్చి నిరంతర చింతనగలిగి వారిని జేర్చునది"
అను విశేషార్థాన్ని పరిగణించి, హరిమీడేస్తవ వ్యాఖ్యానానికి
మచర్చికా వ్యాఖ్యానమని పేరు పెట్టబడింది.

